శ్రీ ర స్తు.

# సత్ప్రవర్తనము

ఇ య్యా ది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు
కా వ్య స్మృ తి తీ ర్థ
జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడినది.





Approved by the Text-Book Committee for School use.
*(Vide Page 245 - Ft. St. George Gazette)*
*Part I B. D. 12-4-32*

తృతీయముద్రణము.

చెన్నపురి:
వావిళ్ల ప్రెస్సున
ముద్రింపఁబడినది.
1935



మూల్యము
~~10~~ 0

# FOREWORD.

I deem it a great privilege to be given the opportunity of writing this short foreword to this valuable contribution of school books by my esteemed and learned friend and colleague, M. R. Ry., J. Seshadri Sarma Garu, Senior Telugu Pandit, Municipal High School, Cuddapah. While I am aware of my limitations in the discharge of this pleasing work, I feel I must respond to the call when it comes from such a distinguished Telugu scholar and author as my friend is.

It is now universally recognised that the true aim and object of all education is to draw out what is best and noblest in the pupils, and to enable them to grow into useful and enlightened citizens of the State. This laudable ideal is impossible of achievement unless our educational institutions inspire the young with lofty aims and high ideals, and foster in them healthy habits of life, and take incessant and sedulous care to mould their character which is the sheet-anchor of life and without which no high or useful purpose can be accomplished in life. Among the influences that silently act on the formation of the character of the young, undoubtedly, that of the home comes first, next to it, and perhaps, more effective, is that of the school where various and varied organised opportunities and (activities) exist, designed to promote this process of character-building. The most potent of these is the facilities which schools afford for pupils to cultivate and form friendships and associations with their fellows and teachers, which sometimes, last during a whole life-time. The value, and usefulness of such "Sangas" or

associations depends entirely upon the character of those with whom companionships are contracted. If "Sath Sangas" are formed, their influence to elevate and perfect the character of the associates is incalculable; on the other hand, if the "Sangas" are of an undesirable character, they bring about untold suffering and utter ruin not only during the Scholastic period but also in later life. Such "Sangas" make or mar the future destiny of the young men; and cases are not wanting where many a valuable and promising career has been totally blighted, due to indiscreet and unwise school friendships and associations.

I believe that Mr. Sarma has told this interesting and instructive story in these pages, with a view to impress on our young friends the imperative necessity for them to bestow their utmost care and wisdom in the choice of their friends and companions. It is unfortunately true that young men in many of our educational institutions are going astray and that their 'Sangas' are not all that should be desired; and we who presume to be their Gurus, have a great responsibility in the matter. It is these feelings I feel quite sure, that have prompted Mr. Seshadri Sarma to bring out this book and I confidently hope that his earnest endeavour would largely conduce to the growth of "Sath Sangams" in our Gurukulams.

*Cuddapah.*
25—8—1931.

R. VARADARAJAN,
M. A., L. T.

# శుభవార్త.

మహాశయులారా!

సత్ప్రవర్తన మను పేరఁ బరఁగు నీచిట్టి పొత్తమును మీకర్పింపఁ జాలితి. ఇరువది రెండు వత్సరములపాఠశాలానుభవముగల నే నీ పుస్తకము వ్రాయ నర్హుఁడనని మీరు సమ్మతింతురని నమ్మెదను. ఇందు సత్ప్రవర్తనమహిమము పలువిధములగు నుదాహరణములచే విమర్శింపఁబడినది. దీని యందపూర్వములగువిషయముల నోపికమైఁ బరిశీలించి వ్రాసితి నని చెప్పుకొనఁదగిన విషయము లెవ్వియును లేవు. కాని నాపరిశ్రమ మెంతవఱకు సుహృదయుల యాదరణమునకుఁ బాత్రమగునో పరికించు నూహ కలదని మాత్రమే చెప్పుకొనఁదగినది. విద్యార్థులు చక్కఁగా మది నిల్పుకొనఁ దగిన విషయము లిందెన్నియేని కలవు. వృద్ధికాములగు బాలుర కేయేమార్గములు ప్రవర్తింప నర్హములో యవి యిందుఁ దెలుపఁబడినవి. పెద్దలు బాలుర కిద్దాని బాఠ్యముగా నిర్ణయించిన మేలని తోఁచిన నట్లు చేయుదురుగాక యని కాంక్షించుచున్నాఁడను. పెద్దల యాదృతికిఁ బాత్రమగునేని నా యీ ప్రయత్నము సఫలమగును.

నేనీ పుస్తకము వ్రాసి పంపఁగనే శ్రద్ధగా ముద్రించి నాకొసంగిన మ. రా. శ్రీ, ఈదర వెంకయ్యపంతులు గారికి నాకృతజ్ఞత నేతన్ముఖమునఁ దెలుపుకొనుచున్నాఁడను. నన్ను

విశేషించి యొఱుంగక పోయినను, నావలన నేలాటి యుపకారము లేకపోయినను వీరు దీని నచిరకాలమున ముద్రింపించి యొసంగిరి. వీరి సౌహార్దము ప్రశంసార్హము. వీరి భాషాసేవ ప్రశంసార్హము. భగవంతుఁడు వీరికెల్ల విధములఁ దోడ్పడుఁ గాక యని ప్రార్థించుచున్నాఁడను. ఇంతకన్న వ్రాయఁదగిన విశేషము లేవియు లేవు. పండిత కవు లిందలి తప్పులను నాకుఁ దెలుపుదురు గాక యని వారిని వేఁడుచున్నాఁడను.

ఇట్లు విద్వద్విధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ

# సత్ప్రవర్తనము.

## మొదటిప్రకరణము.

సంపదల కునికిపట్టు జంబూద్వీపము. దానివంటి దదే యని యెల్లరుఁ గొనియాడుదురు. హిమాలయమునకు దక్షిణ భాగమున నాద్వీప ముండును. నాలుగుదెసల సముద్రము లుండిన ద్వీపమందురు. ఈయది ద్వీపకల్ప మనంబడును. ఉత్తరపుదిక్కున సముద్రములేదు. కాని హిమాలయమున్నది. జంబూవృక్షము (నేరేడుచెట్టు) ఉత్తరభాగమునసీమగానున్నం దున జంబూద్వీపమను పేరు కలిగెనందురు. ఏకారణమున నైననేమి లోకప్రఖ్యాతి నీపేరు గాంచెననుట నిర్వివాదము. ఈద్వీపమున ననేకదేశములు గలవు. అందు నాంధ్రదేశ మొక్కఁడు. ఆంధ్రదేశమునకు నంధ్రదేశమను నామాంతరము కలదు. అది కటకమను నగర ముత్తరపుటెల్లగా, శ్రీశైలమను మహాక్షేత్రము దక్షిణపు టెల్లగాఁ గలది. అందు గౌతమీ కృష్ణానదులు ప్రవహించుచు సాగరమునఁ గలియుచున్నవి. ఈయవియే ప్రధాన పుణ్యనదులు. గౌతమీనది యేడుభాగ ములు సాగరమున సంగమించును. ఆభాగము సప్తగోదావరీ తీర మనఁబడుచున్నది.

గౌతమీనది బొంబాయి రాజధానిం గల త్ర్యంబక క్షేత్రమునం బుట్టినది. ఆక్షేత్రము నాసిక యనంబడు ప్రసిద్ధ పురమునకు రెండు యోజనముల దూరమునం బడమర భాగమున నున్నది. త్ర్యంబకము శివక్షేత్రమని యీపేరే చెప్పక చెప్పుచున్నది. ఆ గ్రామమునకుం బడమరదెసం గ్రోశమాత్ర దూరమున నొక పర్వతము గలదు. అది దక్షిణమునుండి యుత్తరమునకు సాగియుండును. దక్షిణపు దిక్కున నించుక తూర్పునకు సాగియుండును. దానికిం బెక్కండ్రు యాత్రాపరులు ప్రదక్షిణము చేయుదురు. ఒక్క యోజనము మాత్రము దాని చుట్టుకొలంత కలదు. దానిపొడ వించుమించుగా రెండు క్రోశములుండు ననవచ్చును. తూర్పునుండి పడమరకు సాగి యుత్తరమునకుం బెరిగిన యొచోట ననంగా నైఋతిమూల యందు గౌతమి పుట్టును. అందొకచోట నందివక్త్రముండును. దాని నోటినుండి బిందురూపమున నీ నదీజలము పడుచుండును. అదియే దాని పుట్టుకతావందురు. నగరము నడుమం గుశస్థలి యను నొకసరస్సు గలదు. గౌతమముని యందు నదిని బ్రార్థించెనందురు. అందుండి నది సాగినట్లగపడదు. చిన్ని కాలువ నిర్జలముగాం గనంబడును. నాలుగు క్రోశముల దూరమున శివవిదిక్కునందుం జక్రతీర్థము కలదు. గౌతమముని చక్రముచే భూమిని భేదింపంగా నది కనంబడి ప్రవహింతునని చెప్పినట్లు పలుకుదురు. అటనుండి స్వల్పప్రవాహముగా నది ప్రవహించును. ఆంధ్రదేశమును బ్రవేశించు నప్పటి కిది యనేకోపనదుల మూలమున వృద్ధినొంది మహానదియగు. దీని మహత్త్వ మపారమందురు. పురాణములయందు దీని మహత్త్వము విశేషముగం జెప్పంబడినది.

మహానది యనఁగా జలములమూలమున మానవులకు మహోపకార మొనర్చునది యనియే మనము విశ్వసింప వలయును. స్నానపానములకు సస్యములకు నది యుపయోగించును. స్నానమారోగ్యము నిచ్చును. జలపానము పుష్టిని మేధాశక్తి నొసంగును. ఇంతకంటెఁ గావలసినదేమి? నదీస్నానమునఁ బాపములు తొలఁగునని పెద్దలందురు. ఆరోగ్యము గలిగి మేధాశక్తి వృద్ధినొందిన మంచియూహాలు గలుగును. ఆ యూహాలు మంచి యలవాటులు గలుగఁజేయును. మంచి నడవడి కలిగినఁ బాపకార్యములు చేయఁడు. ఇఁక నాతఁడే పుణ్యాత్ముఁ డనఁబడును. ఇన్ని యుపకారములుచేసిన నది పూజింపఁదగిన దనుట యుక్తముకాదా!

నదుల సాయము ప్రధానముగాఁ గల్గియున్న భూమి నదీమాతృక యనంబడును. బాలునకుఁ దల్లివలె నది యా భూమికిఁ బయోదానము చేయును. శిశువువలె దాన నది వృద్ధి నొందును. నదుల సమీపముననున్న దేశము ధనసంపన్నమగు. వ్యాపారము సాగును. సమృద్ధిగా ధాన్యముండును. మానవులాఁకటఁ గృశింపకయున్న నాయుస్సు నశింపదు. వయస్సు త్వరగా సడలదు. వార్ధకము చిన్నతనమున నేరాదు. విశేషించి బుద్ధి వృద్ధియై సూక్ష్మవిషయములను గ్రహింపఁజాలును. దాన విద్యాభివృద్ధి గలుగును. అద్దాని మూలమున విఖ్యాతి యెల్ల కడల వ్యాపించును. ఇన్నింటికి మూలము నదియే కదా! కావున నదులవలని యుపకారము లసంఖ్యాకములు. వాని నెల్ల వర్ణింప నిది చోటుగాదు.

గోదావరి యొడ్డున ననేకపురములు, గ్రామములు, పల్లియలు గలవు. అందొక యగ్రహారము మనోహరముగ

నుండెను. దానిపేరు కనకవల్లియని. తొలుత నది పల్లియే. కాని క్రమక్రమమున నది గ్రామమయ్యెను. ఐదువందలగృహములు గలది గ్రామ మనఁబడుననియు, వేయి గేహములుగలది మహా గ్రామ మనఁబడుననియుఁ బెద్దల యభిప్రాయము. గోదావరికి దక్కినపు దెస నాకనకవల్లి యుండును. పానోదక మా గోదావరి నుండియే వారికి లభించును. గ్రామమున నూతులు కలవు. కాని యవి క్షారోదక సంభృతములు, స్నానమున కుపయోగించును. వేసవికాలమున నవి యించుక బాగుండును. వంటకుఁ గూడ నపు డవ్వాని నందలి యాఁడువా రుపయోగింతురు. కాని తెల్లని బియ్యము వండినపిదప నన్న మెఱ్ఱగనుండును. క్రొత్తరంగు తెచ్చి పెట్టు సామర్థ్య మాజలమునకుఁ గలుగుటయే యొకగొప్పయని కొందఱు వినుతింతురు. అకాలమునందును ద్రాగవలెనన్న వారు శర్కరఁ జేర్చి త్రాగుదురు. జలగుణ మప్పుడుకూడ నించుక కానఁబడును.

కనకవల్లియందు నాలుగు జాతులవారు నివసింతురు. ఒక్కొక్కభాగమున నొక్కొక్కజాతివా రిండ్లు కట్టుకొనిరి. అందు దక్షిణభాగమున క్షత్రియులు, నుత్తరభాగమున వైశ్యులు నుండిరి. క్షత్రియు లుదారస్వభావులు. వారికి ధనము కంటె మర్యాదయే యమూల్యధనము. మరియాద కించుక యపాయము గల్గినఁ బ్రాణములఁ దాల్పఁజాలనంత పట్టుదల వారలకుఁ గలదు. అది మొండి పట్టుదలయని కొందఱందురు. జాతి ప్రతిష్ఠ యమూల్యము. దానిం గాపాడుకొనిన సర్వము మేలగు. అది పోయిన సర్వశ్రేయస్సులు పోవును. మర్యాదయే భూషణము. అది యుత్తమ పురుషార్థము నొసంగఁజాలును. తక్కిన పురుషార్థముల నిచ్చునని వేఱుగాఁ జెప్పవలయునా?

దాని లెక్కచేయకయున్న నౌదార్యము శూన్యమగును. కావున జాతిగౌరవమును గాపాడుకొనుటకంటెఁ గర్తవ్యము వేరొకఁడు కానరాదు. ఈవిషయ మాగ్రామమున నుండు భూపులకుఁ జక్కఁగాఁ దెలియును. ధనముగల్గిననే గౌరవము నిల్చునన్నయూహ మంచిదికాదని వారలనిశ్చితము. కావున వారు యదృచ్ఛాలాభసంతుష్టులై యుండిరి. వైశ్యులు ధనవంతులు కులవృత్తిచే జీవించువారు. దేశాంతరములకుంబోయి బేహారము సాగించి యపారధనము నార్జించినవా రందు పెక్కండ్రు గలరు. ఉన్నతావుననే వ్యాపారముచేసి కొంత ధనము సముపార్జించినవారు కొందఱు గలరు. మొత్తము మీఁద వారెల్ల ధనవంతులనియే ప్రసిద్ధిని గాంచిరనుటకు శంకయేలేదు. అత్యల్పసంఖ్యాకులు దరిద్రులున్నను వారును ధనవంతులవరుసలోఁ బరిగణింపఁబడుచుండిరి.

క్షత్రియబాలురు విద్యయు, దానికి సమానముగా ధనుర్విద్యయు నేర్చుకొనువారు. వైశ్యబాలురు వ్యాపారోచిత విద్య నభ్యసించువారు. ఈయాచారము చాలకాలమునుండి వచ్చుచుండెను. అన్నవస్త్రములకుఁ గొఱఁతలేక తక్కినజాతులవారును నెమ్మదిగనేయుండిరి. విద్యావిహీను లాకనకవల్లియందు లేరన్న విఖ్యాతిమాత్రము లోకమున వ్యాపించెను. యాచకులు ప్రతిదిన మాగ్రామమునఁ గనఁబడుచుందురు. యథోచితసత్కారము వారలకు జరుగుచుండునని యూహింపవచ్చును. సత్కారమున కించుక కొఱంతగల్గిన వారిరాక కవకాశ మెట్లు? పెక్కువర్షము లిట్లు గడచెను.

కనకవల్లికి దక్షిణభాగమున నొక పత్తనము గలదు. కుముదవల్లి యని దాని పేరు. అందు రాజకీయోద్యోగులుందురు.

అది యుపమండలమునాఁ బ్రఖ్యాతి గాంచెను. ఉపమండలమును గొందఱు తాలూకాయని వాడుదురు. ఉపమండలాధికారి సభాభవనమందుఁ గ్రొత్తగా గట్టఁబడినది. దానింజూచుచు విసుగు లేక యానందించువారా చుట్టుపట్టులఁ గొందఱు గలరు. మిక్కిలి యెత్తుగా నది యుండును. అందొక భాగమునఁ గోశస్థానము గలదు రక్షకభటు లద్దానిం గాపాడుచుందురు. అందెవ్వరికిని బ్రవేశము దొరకదు దాని యధికారియే యద్దానిచెంత నుచితపీఠమునఁ గూర్చుండియుండును. ఆ ధనమును జూచుచునే యుండును. విసుగన్నది యాతనికిలేదనుట విచిత్రముకాదు.

కొంతకాలమున కాకుముదవల్లియందు దొరతనమువా రొక పాఠశాలను గట్టించిరి. ముందున్న వానికన్న నది మిన్నయని యెన్నికంగాంచి యున్నతపాఠశాల యనుపేరునఁ బ్రసిద్ధమయ్యెను. ఆపాఠశాల పురమునకు నుంతదూరమునఁ గట్టిరి. అది కట్టినచోటు ముందు సుందరోద్యానముగా నుండెను. వేసవి దినములలో బాటసారులు నగరవాసులు నందుఁ గూరుచుండి బడలికలుడుగ హాయి చెందువారు. దాని ముందొక బాటగలదు. వచ్చువారు పోవువారు విరామము లేకయుందురు. వారెల్లరా తోఁటలో నించుక కాలము గడుపుచుండు వారలే యనవచ్చును. అందుఁ గూరుచున్న సూర్యరశ్మి దృగ్గోచరమగుట కష్టమే. ఫలవృక్షములు, పుష్పలతలు మెండుగా నందుండును. కర్కాటితికి లోనై ఫలములు కోసికొనిన నందున్న కావలివా రేమనరు. ఏకాలముననైన ఫలము లేవో యందు దొరకును. పండ్రెండు నెలలు పాంథులకుఁ దృష్టి చేయవలయుననియే ధర్మాత్ము లుద్యానములను మార్గముల

కడ ఫలభరితతరువర సంకులముగా నిర్మింతురు. వాని వలనఁ గలుగు లాభముల వారు కోరరు.

ప్రకృతోద్యానముకూడ నావిధముగనే తొలుత నిర్మింపఁబడినది. వారి వంశమునఁ బుట్టినవారుఁ లుబ్ధులై రొక్కమునకు దాని నమ్ముకొనిరి. ఫలవృక్షముల నవలీలఁ గుఠారధారల కాహుతిగానిచ్చి యాచోటున నీపాఠశాలను గట్టించిరి. విద్యాశాల యెంతపవిత్రమో యూహింపవచ్చును. పాఠశాల చుట్టును గొట్టగా మిగిలిన చెట్లు కొన్ని యుండెను. అందొక భాగమున సరోవరము నిర్మింపఁబడి యుండెను. విద్యార్థుల కది యనర్థావహమ్మని భావించికాఁబోలు దానింబూడ్చి నూయిగా మార్చిరి. కమలములు ముచ్చటగా నందుండెను. వాని నెందఱో కోసికొని పోయి భగవంతు నారాధనమున కుపయోగపఱచుచుండిరి. వారికార్యము వలదన్నను వినక పాఠశాలాసంస్థాపకసంఘమువా రిట్లు దాని మార్చిరి.

ఆపాఠశాల నిర్మించిన దాదిగాఁ గనకవల్లియందుండు రాజులు, వైశ్యులు తమ తనయులను విద్యాభ్యాసమునకై యచటికిఁ బంపుచుండిరి. విప్రులు శూద్రులు ధనవంతులుగాని ధనవంతులకే యందు విద్య నభ్యసింప శక్యముగానఁ దమ బాలురఁ బంపక యుండిరి. ఆపాఠశాలయందు విద్యనభ్యసించి పరీక్షయం దాఱితేఱిన గొప్పయుద్యోగములు దొరకుననుప్రవాదము క్రమక్రమముగాఁ బ్రబలెను. అందలి విద్యార్థులకుఁ గన్నియలీయఁ బలువురు వచ్చుచుంబోవుచున్న వారన్న వార్తయు నెల్లరకుఁ దెలియవచ్చెను. ఈరెండు వినఁబడినతోడనే విప్రులు శూద్రులును దమతమ బాలకులను బాఠశాలకుఁ బంపసాగిరి. ఉన్న మాన్యక్షేత్రముల నాధివెట్టి కొందఱును,

ఏపాటి మూల్యమునకో యిమ్ము కొందఱును బాలురఁ జదివింప సాగిరి. ఆవిద్య పూర్తికాఁగానే తమబాలు రుద్యోగములలోఁ బ్రవేశించి ధనముకుప్పలుగాఁ దెచ్చి తమయిండ్లనింపుదురనియుఁ గోటీశ్వరులు వచ్చి తమతనయులకుఁ గన్యకల నిత్తురనియుఁ దన్మూలమున గొప్పమర్యాదయు ధనము చేకూరునని వారూహించిరి. మఱికొందఱు దేశాటనముచేసి ధనమార్జించి తెచ్చి చదివించుచుండిరి. ఈరీతిగా నాకనకవల్లింగల బాలురు పాఠశాలకుఁ బోయి చదువుచుండిరి. క్రమక్రమముగా విద్యార్థుల సంఖ్య హెచ్చుచుండెను. దానింబట్టి యుపాధ్యాయుల సంఖ్యయు వృద్ధి నొందసాగెను.

ప్రతివత్సరమందుఁ బరీక్షలు సాగుచుండును. అందాఱితేఱినవారికి బహుమతులియ్యఁబడును. అత్తఱి నొకగొప్పసభ సాగును. పెద్దమనుష్యు లచటికి వచ్చుచుందురు. పాఠశాలాధ్యక్షుఁడు వారివారి యోగ్యతలం దెలుపును. సభ్యులు కొంద ఱంతకుముందే నిర్ణయించిన బహుమతుల నాయావిద్యార్థుల కిత్తురు. బహుమతుల నిచ్చుట కాసభ కొక యధికారి వరింపఁబడును. ఆయన యగ్రాసనాధిపతి యని పిలువఁబడును. పాఠశాలాధికారి యోగ్యతలను, సంవత్సరాయ వ్యయములను దెలుప నగ్రాసనాధిపతి యందుఁగల మంచిచెడుగులను దెలుపుచు నుపన్యసించి పిదప విద్యార్థులకు బహుమతుల నిచ్చును. వానింగాంచి తక్కుంగల విద్యార్థులు బహుమతులం బొంద వలయునని యూహించి పట్టుదలతోఁ జదువుదురను తలంపుననే యీకార్యము జరపఁబడును.

ఆపాఠశాలయందు బాలురతోడ బాలికలును జదువ సాగిరి. తొలుదొలుత బాలికలకు విద్యయే పనికిరాదనువారు

కూడఁ గొన్ని దినములకుఁ జదివింపఁ దలంపసాగిరి. బాలికల సంఖ్యయు వరుసగా హెచ్చ సాగెను. అది దేశాభివృద్ధికి మూల మని యుపాధ్యాయులు నొక్కి చెప్పుచుండిరి. బాలికలకు విద్య కొంచెము వచ్చినను బహుమతులు గొప్పగా దొరకుచుండెను. బహుమతుల వారు కైకొనుతఱిఁ గరతాళధ్వను లంబరమును బ్రద్దలుచేయుచుండెను. ఆ బాలికలబంధువులు తల్లిదండ్రులు పరమానందము నొందుచుండిరి. ఆబాలికలకుఁ దగినవరులు విద్యాధికులే కావలయునని తల్లిదండ్రులు వెదకుచుండిరి. వారిం బెండ్లియాడఁగోరి కొందఱు చదువుచుండిరి. తఱచుగా నా పాఠశాలయందే చదువువారలే వారికిఁ బతులగుచుండిరి. అది చాల వినోదముగా నుండెను. ఈ యలవాటు తఱచుగా నుండ సాగెను.

కనకవల్లియందుండు రాజకుటుంబములలో నరపతు లను నింటిపేరు గలవారు మర్యాదచే జీవించుచుండిరి. విశేష ధనవంతులుగారు. కాని యన్నవస్త్రములకు లోటులేక వారు కాలముపుచ్చుచుండిరి. రామచంద్రరాజు తత్కాలమున నాకు టుంబమున కధికారిగానుండెను. ఆతనికి సుశీలయను సాధ్వి ధర్మపత్నిగా నుండెను. కొంతకాలముదనుక వారికి సంతతి లేకుండి భగవదనుగ్రహమున నొక్కకుమారుఁడు కలిగెను. సీతారామరాజనునామ మాతనికిఁ బెట్టఁబడియెను. గారాబు బిడ్డఁడుగాన నతిప్రీతితో వారు పెంచిరి. శుక్లపక్షమున విదియ నాఁటిచంద్రబింబమువలె వృద్ధినొంది యేడేండ్ల వయసు గలఁ వాఁడయ్యెను. ఆయీడునకుఁ దగినట్లు విద్యవచ్చెను. ఉపనయ నము బ్రాహ్మణుల యాచారప్రకార మేడవయేటఁ జేయఁబడి

యెను. అది వారియింటి యాచారమగుటఁ దక్కంగల రాజు లాక్షేపింపరైరి.

సీతారామరా జుపనయనానంతర మాపాఠశాలకే పంపఁబడియెను. కనకవల్లి కది కడుదూరమున నుండక యించుక దగ్గఱగా నుండినందున విద్యార్థులు తమయిండ్ల భుజించియే వెళ్లుచుండిరి. సీతారామరాజు సుందరమగు నాకృతిఁ గలిగియుండువాఁడు. మోము లావణ్యామతముగా నుండును. కన్నులు విశాలములై హరిణనయనముల గేలిసేయుచుండును. తక్కిన దేహభాగము లన్నియు సాముద్రిక శాస్త్రమునఁ జెప్పఁబడినచందమున నుండుటంజేసి యుత్తమపూరుషుఁ డగునని తెలుపుచుండెను. పెక్కం డ్రాకుమారుం దిలకించి రూపవంతుఁడే యని యొకరికొకరు తెలుపుకొనుచుండిరి పురంధ్రీమణు లాతనింగని చక్కని బాలిక యీతని జెట్టపట్టవలయునని యాశీర్వదించుచుండిరి. తల్లిదండ్రులు మాపిల్లవానికి సకలవిధములఁ దగిన కన్యక దొరకునా యని యాశించుచుండిరి.

సీతారామరాజు పుస్తకములఁ దీసికొని పాఠశాలకుఁ బోవుచు నిటునటు చూడక యేదో యోజించుకొనుచుఁ బోవువాఁడు. కొందఱు బాలురు నలుప్రక్కలం జూచుచుఁ గుంటివారిని, గ్రుడ్డివారిని, జెవిటివారిని, నంగహీనులను, గుష్ఠవ్యాధి బాధితులను గని నవ్వుచు గేలిసేయుచుఁ దొలఁగిపొండని తిట్టుచుందురు. అట్టి దురభ్యాసము లీ బాలునకుఁ బట్టుపడలేదు. పూవుతోడనే పరిమళ ముదయించి యది వృద్ధినొందు కొలఁది నదియుఁ బెరుగును గదా! అట్లే మానవుఁడు జన్మించినతోడనే యంకురించిన గుణములు వరుసగా నభివృద్ధి

నొందుచుండును. అంతియకాని తొలుత లేకయుండి నడుమఁ బొడసూపవు.

"దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వముచితజ్ఞతా,
అభ్యాసేన న లభ్యంతే చత్వారస్సహజా గుణాః."

అన్న పెద్దలమాట సార్థకమే గదా. దురభ్యాసము లనఁబడు వానిలో నితరుల నాక్షేపించుట, అందు నంగహీనులంగాంచి దూఱుట మఱెంత పాపము. వృద్ధికాములగు బాలుర కవి యుండవు. మంచి యలవాటులే వారికిఁ బట్టుపడును. సీతారామరాజుం జూచి తక్కిన బాలురు నవ్వుచుండిరి. కాని వారినవ్వుల నతఁడు లెక్కింపక యుండెను. కొలఁది నెలల కాతనిశీల మాప్రాంతముల నెల్లయెడల నల్లుకొనియెను. మంచి బాలుఁ డన్న పేరు సర్వజన విదితమయ్యెను.

పాఠశాలయందుఁ గల యుపాధ్యాయు లావిద్యార్థిని ప్రేమచేఁ జూడసాగిరి. ఏకారణముననైన నొక్కనాఁడు పాఠము సరిగా రాకయుండునేని వత్సా! దేహమారోగ్యము గలదియే కదా. అని యడుగుదురు. అతఁ డౌననును. ఆరోగ్యముఁ గలిగి యుండు తఱిఁ బ్రమాదముననైనఁ గాలము వృథపుచ్చఁడని వారెఱుంగుదురు. ఒక్కపుడైన నే బాలునకుఁగాని శ్రమము కలిగింపక యుపాధ్యాయుఁడు చెప్పినదెల్ల నేర్చుకొనుచుఁ దెలియని విషయము నడఁకువతోఁ నడుగుచుఁ బరాకులేక పాఠముల నభ్యసించుచుండెను. పాఠశాల వదలినతోడనే గురువు ననుమతిం గైకొనియే గ్రామమునకుఁ బయనమగును. వేళతప్పక యిల్లుచేరును. ఏదోకారణమున నించుక యాలస్యమైనచో నతని తండ్రి వెదకుచు వచ్చువాఁడు కావున నట్టి

మనోవ్యాకులము తనవలనఁ దండ్రికిం గలుగఁగూడదని యాతనియాశయము. వేళకుఁ గొడుకు రాకయుండినఁ దల్లి యుమ్మలించుచుఁ దలవాకిలిల్లుగా భావించి దారిఁ జూచుచుండును. లేకలేక కలిగిన సంతానముపట్ల జననీజనకుల కట్టి భావముండుట లోకసామాన్య ధర్మమే కాని క్రొత్తది కాదు.

ఆబాలుఁడు పాఠశాలకుఁబోవుచు వచ్చుచుండునపు డా యూరనున్న నారీమణులుచూడ నోచిరేని యేదోయొకమిష చే మాటలాడించి కాని పోనీయరు. నాయనా! చదువుకొనుచున్నావాయని యడుగువారు కొందఱు, అమ్మ బాగున్నదా, నాయనగారికిఁ గుశలమాయని ప్రశ్నించువారు మఱికొందఱు, ఏకక్ష్యలోఁ జదువుచున్నాఁడవు బాబూ అనియడుగువా రింకను గొందఱు నిట్లే యేదో యడుగుచు నించుక కాలము పుచ్చి యాతనింగాంచి సంతసించి యింకఁబోయిరా బాబూ అని సాగనంపువారు. ఇట్లు చూచినవారెల్ల నాసుశీలుని బ్రీతిపురస్సరముగా మాటలాడించుచుండిరి. ఆకాంతామణులఁ గన్నెత్తియైనఁ జూడక తలవంచుకొనియే బదులుపలుకువాఁడు. ఇట్లు నానాఁటి కావిద్యార్థి యెల్లరమన్ననకుఁ బాత్రుఁడయ్యెను.

కనకవల్లియందే నివసించు వేరొక రాజకుటుంబము కాకరపర్తి యను గృహనామమునఁ బ్రసిద్ధమై యుండెను. వరపతి కుటుంబమునకన్న నీకుటుంబము భాగ్యసంపన్నము. మర్యాదగలదనియే ప్రతీతి. కాకరపర్తి కుటుంబమున కధికారి మధుసూదనరాజు. ఆయన ధర్మపత్ని యిందిరాంబ. వారికొక పుత్రకుఁడు కలిగెను. సూర్యనారాయణవర్మ యని నామకరణమొనర్చి యాతనిం బెంచుచు మహానందము నొందుచు నా దంపతు లదృష్టవంతులమే యనుకొనుచుండిరి. సీతారామ

రాజునకు నీ బాలునకు వయస్సున నించుక భేదము. కొన్ని నెల లీతఁడు చిన్నవాఁడు ఒక్కవీథియందే వీరి గృహములు రెండును గలవు. రాజగృహములను సాధారణముగా దివాణ మని ప్రజలు పిలుతురు. ఈ రెండుగృహములు దివాణము లనియే పిలువఁబడుచుండెను. కాకరపర్తివారి యిల్లు పెద్ద దివాణమనియు, నరపతివారిల్లు చిన్నదివాణమనియు వాడుకఁ గాంచెను. ఆశ్రితులీ రెండుదివాణములను నమ్ముకొని యెవరి యింటికిఁ బోయినపుడు వారిని బొగడుచు జీవించుచుండిరి. ఈస్తుతులు వారిహృదయమునఁ గల ప్రీతిని దెలుపునవి యనియే వారు తలంచిరనుట క్రొత్తపద్ధతిగాదు. ముఖస్తుతు లకు బేలుపోవనివారు లేరనరాదు గాని సామాన్యముగా లేరన వచ్చును. మ్రోల నుతించువాఁడు పరోక్షమున దూషించునని నమ్మవచ్చును. మ్రోల దోషముల నేకాంతమునఁ దెలుపువాఁడు పరోక్షమున వినుతించు ననవచ్చును. ఈ రెండు నియమము లకు సాధారణముగా లోపమురాదు. లోకమున వంచకులు ముఖస్తుతులు చేయుదురు. తన పనికాఁగా లెక్కింపక యిచ్చ వచ్చినట్లు తూలనాడుదురు. శ్రేయస్సు కాంక్షించువాఁడే మిత్రుఁ డనంబడును. ఆతఁ డొంటరిపాటున నీయం దీదోషము లున్నవి. వాని నెట్లైనఁ దొలఁగించుకొనుమని హితోపదేశము చేయు. ఆతఁడు మనమేలుకాంక్షించినవాఁడు. మనములేని తావున మన దోషములఁ గప్పిపుచ్చి యణువులుగానున్న సుగుణములఁ గొండంతలుచేసి పొగడును.

"... ... మిత్రసమాఖ్యరత్నముఁ
శ్రీకరవర్ణయుగ్మము సృజించినయున్నతపుణ్యుఁ డెవ్వఁడో."

యన్న సూక్తి ప్రథితమేకదా. అట్టు లా దివాణములు రెండును నాశ్రితుల మూలమున విశేషించి పోగడ్తం గాంచెను.

సూర్యనారాయణరాజు కుముదవల్లిపాఠశాలకుం బంపం బడియెను. ప్రథమ ప్రవేశము గానం దొలుతం బాఠశాలాధికారికిం దెలిపి యలంకరింపవలయునని ప్రార్థించి వలయు పరికరములం బంపి మధుసూదనరాజు తన భాగ్యమునకుం దగినట్లుత్సవము చేయింపం బూనెను. ఉపాధ్యాయులందఱు ధనవంతుని కొడుకు చదువవచ్చుచున్నవాఁడనియుఁ దమ కప్పుడపుడు బహుమతులు దొరకుచుండుననియుఁ దలంచి యాయుత్సవమునం బాల్గొనిరి. పాఠశాల బహిర్ద్వారము పచ్చని తోరణములచేఁ గైసేయఁబడియెను. ఇరువంకల నరఁటికంబము లునుపఁబడియెను. పండ్లగెలలు నవి వంగియుండెను. అది మొదలు పాఠశాలవఱకు నొక మార్గ మేర్పఱుపఁబడియుండెను. దానికి రెండుప్రక్కల మంచిచెట్లు పెంచఁబడియుండెను. అవి మిక్కిలి చల్లగా నుండుటే కాక పూలతావుల వెదఁజల్లుచుండెను. పండ్రెండు నెలలు నాపూవులు కొఱంత లేక యుండును. ఆవృక్షము లమెరికా యను దేశమున దక్షిణభాగమునఁ గల (బ్రెజిల్) దేశమునుండి తెప్పింపఁబడినవని యెల్ల రనుకొనుదురు. భరతఖండవాసు లవ్వానింగాని వానిం బోలిన వృక్షములఁ గాని చూచియే యెఱుంగరు. శీతల ద్రుమములనవచ్చును. పుష్పవృక్షము లనవచ్చును. ఆపూవులు నాకుల వలెనే యుండును. కాని వాని పరిమళము విచిత్రము. ముక్కురంధ్రముల నానందింపఁ జేయుటయే వానిపని. చూడ శృంగారముగా నుండక యాకుసుమములు ధరింపవలయునను కోరికను బుట్టింపక యుండును. చెంతనున్న వారికంటె దూరముననున్న

వారాపరిమళము నాస్వాదించి సంతృప్తి నొందుదురనుట నిర్వివాదము. ఆవృక్షపర్ణములు లేఁతగానున్నట్లే కనఁబడును. పండుటాకుల నెవ్వరును జూడఁజాలరు. క్రిందఁ బడునంత దనుక నవి లేఁతయాకులవలెనే యుండును. వానియందొక జిగురుండును. అది లేకుండుటయే వానికిఁ జరమ దశయని యూహింపవలయును.

వాని నడుమనున్న మార్గము కన్నుల పండువు చేయఁ జాలును. మధ్యాహ్నమున గ్రీష్మకాలము నాదారిని నడుచు వారు దాని వదలఁ జాలరు. కడుదూరముగా నిది వ్యాపించి యుండిన యెంత బాగుండునో యని యూహించువార నేకులు గలరు. ఆత్రోవన నూఱుబారలపోవ నొక దివ్యభవ నము కనఁబడును దానిం జూచినంతనే యపూర్వసంతోషము పొడసూపి యిందుఁ బఠించిన నెంతయో మేలుగలదనియే తోఁచును. దానిముందొక భాగము పాఠశాలనంటి ముందునకు సాగియుండును. దాని స్తంభము లిష్టకలచే నిర్మింపఁబడినవి. ఎత్తుగా నవి యుండును. అది శకటములు నిలుచు తావు. శకటములపైఁ జనువారందు దిగి లోపలికిఁ బోవవలయును. లోనికిం బోవఁగనే విశాల సభాస్థలమొక్కటి చక్కఁగఁ గనఁ బడును. అందుఁ గూరుచుండి యుపన్యాసములను విందురు. అవి తూర్పు పడమరలకు సాగియుండు. దానికి రెండు ప్రక్కల బాలురకుఁ బాఠములు చెప్పు గదులుండును. ఒక్కొక్క భాగమున నాలేసి యవి కలవు అందుండి వచ్చువారాసభా స్థలమునఁ దమ గదులకడ నుండు మార్గమున వెలికిఁ బోవల యును. సభాస్థలమునఁ బీఠము లమర్పఁబడియే యుండును. అందుఁ గూరుచుండి వేదికపై నిలుచుండి చెప్పుచుండు

నుపన్యాసమును వినవచ్చును. ఆతఁడు పడమరమోముగా నిలుచుండును. ఆ పీఠములయందు శ్రమము లేక నాల్గు వందలపై డెబ్బదియైదుగురు కూరుచుండవచ్చును. ఆ పీఠములకు నిరుప్రక్కల విద్యార్థులు వేఱొక గదికిఁగాని వెలుపలికిఁ గాని పోవ మార్గము వదలఁబడియుండెను.

ఆయుత్సవము మంగళవారమున సాగెను. కొందఱు మంగళవారము విద్యాభ్యాస మొనరింప మొదలుపెట్టఁ బనికి రాదనిరి. కాకరపర్తివారి పురోహితుఁ డన్నంభట్టు. ఆయన తండ్రి గొప్ప పండితుఁడని పేరుగాంచెను. ఈ యన్నంభట్టు కూడ నిరక్షరకుక్షిగాఁడు కాని తండ్రి పేరు చెప్పుకొని బ్రదుకఁ దగినంత పాండిత్యమును సంపాదించెను. పాండిత్యము కలదో లేదో దేవుఁడెఱుఁగును. కాని మొండి పట్టుదల యందఱకుఁ బ్రత్యక్షమగుచుండెను. ఆతనితో వాదమునకుఁబూనుట రేగుచెట్టుపై నంగవస్త్రము వేసి దాని నూడఁదీసికొనునట్టిది. కావున నెవ్వరాతనితో విశేషించి వాదింపక తొలఁగిపోవుదురు. మొండిపట్టుదలయొకండుగాక దుర్వాసుని స్మరింపఁజేయు కోపముకూడ నతనికిం గలదు. వాది బలహీనుఁడైన నొకప్పుడు భగ్నదంతుఁడు కాక తప్పించుకొని పోఁజాలఁడని యందఱనుకొందురు. నలువురిలో నున్నప్పుడుకాని యతనితో వాదింపరు. ఆముహూర్తము నెవరో మంచిదికాదని మధుసూదనరాజునకుం దెల్పిరి. ఆతనికింగూడ నించుకజంకులేక పోలేదు. అన్నంభట్టు తనకు శరణ్యుఁడని యూరక విడుచువాఁడు కాఁడు. ముంగోపము పుట్టుకతో వచ్చినదేకాని నడుమరాలేదు. వెనుక నిట్లంటిఁగదాయని పరితపించుటయు నాతని యలవాటులలో నొక్కటి. కోపమునాపుకొనఁబ్రయత్నించుటకా యన్నంభట్టు

ప్రయత్నించిన పాపమునఁ బోలేదు. రాజు ముహూర్తమును గొంద అనుమానించుచున్న వారన "శస్త్రం కుజేఽర్కేఽభ్య సేత్" అని జ్యోతిర్విదాభరణమున నున్నదని యతఁడు బదులు చెప్పెను. అప్పుడొక యభ్యాగతుఁ డందుండి యా పొత్తమున నాశ్లోకమే లేదనెను. అన్నంభట్టు కన్నులెఱ్ఱచేసి జ్యోతిర్విదాభరణము మూఁడుభాగములు. మూఁడవభాగ మచ్చుపడలేదు. మాయింట నున్నది. ప్రతిదినము దానిలోని తాటియాకు నొకదానిని దంతధావన కాలమున నాలుకపైఁ గల మలినము వాపుకొన నుపయోగించుచున్నవాఁడను. నాకాపొత్తము హస్తగతము. అందులేదేని పదివేల రజిత ముద్రికల నిత్తును. నీవిత్తువా? పందెము కట్టుము. తెచ్చి చూపెదను. అనిగద్దించెను. ఆతఁడులికిపడి యీతని బారినుండి తప్పించుకొన్న నదృష్టవంతుఁడనే యనుకొని మౌనముద్రను దాల్చెను. రాజు క్షత్రియులకు మంగళవారము శుభప్రద మేమో యనుకొని యట్లే కానిండనెను.

రెండవ యామమున మొదటివిఘటికలో నుత్సవము తోఁ బాఠశాలఁ బ్రవేశింపవలయునని మౌహూర్తికుని యా నతి. కాన నుత్సవవాద్యములతోఁ గనకవల్లినుండి బయలు వెడలి కుముదవల్లిఁజేరి మధుసూదనరాజు పుత్త్రుఁడు తన్మిత్ర బాలురు బంధువులు సేవకులు కూడరాఁగా సకాలమునఁ బాఠ శాలఁ బ్రవేశించెను. ఉపాధ్యాయులు వారికెదురేగి పిలుచు కొనివచ్చిరి. ఆప్రవేశకాలమున ద్వారముకడ నిలుచుండిన దీనాంధకబధిర కుబ్జవికలాంగులు "బాబూ భిక్షమిండు, భిక్ష మిండు" అని వేఁడుకొనుచుండఁగాఁ బిలువని పేరంటమనునట్లు ధర్మాత్ములుకొందఱు తమ్మునెవ్వరు నియమింపకున్నను వారి

నవ్వులికిఁ బోండని తిట్టికొట్టి త్రోసివైచిరి. మఱికొందఱు వారిని త్వరితముగ రెంటుఁడని పురికొలిపిరి. అంతియకాని యిట్టి మంచితరుణమున వారలకు సాయపడుఁడని ప్రోత్సహించువాఁడొక్కఁడైన లేకుండెను.

పాఠశాలం బ్రవేశించినతోడనే యెల్లరు బాలకుని తోడి బాలురలోఁ గూరుచుండఁజేసి వాడుకచొప్పున నేదో యొక పాఠము బోధించినట్లు నటించిరి. ఒకయర్ధఘటికలో నెల్లరకుఁ బుష్పఫలాదు లీయఁబడియెను. పన్నీరు చల్లఁబడియెను. ఎల్లరు బాలుని దీవించిరి. ఆనాఁటికి మధుసూదనరాజునకు మర్యాద గనఁబఱచుటకుగాఁ బాఠశాల మూయఁబడియెను. బాలురత్యుత్సాహమునఁ గేకలువేయుచు నిండ్లకుఁ బోయిరి.

---

# రెండవ ప్రకరణము.

సీతారామరాజు పండ్రెండు వత్సరముల వయస్సు వచ్చునప్పు డుత్తమకక్ష్యలోఁ జదువుచుండెను. దానిపై కక్ష్యయే యాపాఠశాలయందు హెచ్చుది. దాని పరీక్షలోఁ గృతార్థుఁడైనచో విద్యావంతుఁడను పేరుఁ గాంచును. ఆ పేరు గలవారలలోఁ దాను బ్రథమగణ్యుఁడు కావలయునన్న యుత్సాహ మాబాలుని మనస్సున దినదినాభివృద్ధిని గాంచుచుండెను. ఉత్సాహమే మానవునకు బలము. ఉత్సాహమే

శక్తి. ఉత్సాహామే సంపద. అది లేకున్న వృద్ధి నెవ్వఁడును గాంచఁజాలఁడు. అదృష్టమున్నఁ దనకుఁదానే విద్యలభించునని కొందఱందురు. అది మిగులఁ బొరపాటు. దైవ పౌరుషము లనఁబడునవి రెండును శక్తిమంతములే. పౌరుషమనఁగాఁ బురుషప్రయత్నమని యర్థము దైవమనఁగా నదృష్టము. పురుషప్రయత్నము లేక దైవము ఫలింపదు. దైవమునే నమ్మి ప్రయత్నము చేయనివాఁడు కాపురుషుఁ (మూర్ఖుఁడు) డనంబడును. దైవము తోడ్పడక పౌరుషము ఫలింపదు.

క. విను పురుషుఁడు కావింపని
పనులకు దైవమది యెట్లు ♦ ఫలమొనరించున్
జనములు కార్యము నడపఁగ
ననుకూలత నిచ్చుఁగాక ♦ యర్థ్యోఫలముల్.

తే. పౌరుషమ్ము దైవమ్ముతో♦డ్పాటులేక
ఫలము పొందంగనేరదు ♦ పార్థివేంద్ర
విత్తు సహకారి కాకున్న ♦ రిత్తనేల
వంధ్యయగుఁగాక తా ఫల♦వంతమగునె?

తే. మేలు రెండులోకంబుల ♦ మేలతెచ్చుఁ
గీడుచేసిన తప్పదు ♦ కీడ యగుట
గాన పురుషవర్తనమున ♦ కానుకూల్య
శీలమగు దైవమది ఫల♦సిద్ధిఁజేయు.

క. విను పౌరుషమును దైవము
నన రెండును గార్యఫలము ♦ నందింపఁగనె
ట్టన కారణములు గావున
జననాయక సదృశములు వి♦చారింపంగన్.

అని మహాభారతము బోధించుచున్నయది. అట్టి యుత్సాహబల మూఁతగాఁగా నావిద్యార్థి యుపాధ్యాయుల మన్ననలకుఁ బాత్రుఁడై సుంతయు గరువములేక విద్యఁ గఱచుచుండెను. ఆతనింగని మీరు ప్రవర్తనము బాగుచేసికొనుఁడని గురువులు విద్యార్థులకుఁ దెలుపుచుండిరి. ఒక్కదినమైన నా సీతారామరాజు వేళకు రాక యాలసించిన పాపమునఁ బోయినవాఁడు కాఁడు. ఎప్పుడైన రెండు మూఁడు నిమేషము లాలస్యముగా వచ్చినచో నా ప్రథమోపాధ్యాయుఁడు ఘటికాయంత్రమును సవరించును. పరికించిన దాని యందే లోపము కనఁబడుచుండును.

వేళకు వచ్చి యూరక కాలమును బుచ్చక పాఠములఁ జూచుకొనుటయు, నితరులు మాటలాడించిన నది యనవసర ప్రసంగమయ్యెనేని బదులిడక పుస్తకము నేచూచుచుండుటయు, దన సాయమును గోరిన బాలురకుఁ దనకుఁ దెలిసిన పాఠముల సారమును దెలుపుటయు, నవ్వుచు నెల్లరతో మాటలాడుటయు, నసూయ నొందక యుండుటయు, నుపాధ్యాయులం గాంచినంతన లేచి వారి యనుమతిని గూరుచుండుటయుఁ, బాఠము సరిగాఁ దెలియకయున్న విషయము మీఁఱ నుపాధ్యాయుల నడిగి తెలిసికొనుటయు, వారు ముఖ్యభాగము లివి యని తెలిపిన వెంటనే వానికి గురుతులువైచి వేఱొకచోట వ్రాసికొని వానిని శ్రద్ధగా మనస్సున నిముడునట్లు చేసికొనుటయు, విశేషించి యందఱతో మాటలాడకుండుటయు నా సీతారామరాజునకుం గల యలవాటులు. మఱియు నతఁడు దీనాంధక బధిరకుబ్జులంగాంచినపుడు కన్నీరువదలిభగవంతుఁడు వీరిని గాపాడుఁగాకయని ప్రార్థించును. తనకుఁ బెద్దలిచ్చిన విత్త

మున నుచితరీతి నట్టివారికే కొంత యిచ్చును. ఇచ్చునప్పుడితరులకుఁ దెలియక యుండవలయునని యాతనియాశయము. ముఖస్తుతుల కుబ్బఁడు. విశేషించి యితరులను భూషింపఁడు. ఆ యలవాటు మంచిదికాదని యావిద్యార్థి నిశ్చితము. ఇతరులు తనకడ వేఱొకరిని నిందించినఁ దానటనుండి లేచి పోవును. అట్లుచేయ నవకాశము లేదేని మనస్సును వేఱొక పనియందు నియమించును. ఇతరుల దూషించువారు తనను గూడఁ బరోక్షమున దూషింతురనియు, నట్టివారి పొందు మంచిదికాదనియు నతని యభిప్రాయము. ఎవ్వరికడ నెంత మాత్ర మేలాగు మాటలాడవలయునో యతనికి దెలిసిన ట్లితరులకుఁ దెలియదని యెల్లవారనుకొందురు.

సూర్యనారాయణరాజుకూడ సీతారామరాజు చదువు కక్ష్యయందే చదువుచుండెను. ప్రతివత్సర మాతని కింటియొద్దఁ జదువుచెప్పిన యుపాధ్యాయుఁడు పడరాని కష్టములఁబడి యందఱి నాశ్రయించి యెట్లో పైకక్ష్యలోని కీతనిఁ జేర్చుచుండును. విశేష బుద్ధిమంతుఁడు. అనారోగ్యమున నీనడుమఁ జదువఁజాలక పోయెననియు, నీవత్సర మందఱికన్న మిన్నగాఁ గృతార్థుఁ డగుననియు నాయుపాధ్యాయుఁడు చెప్పుచుండువాఁడు. ఆతనిదీనాలాపములకు మనస్సులుకరఁగి యెట్లో యితరోపాధ్యాయు లొదల లూపువారు. అంతియెకాని సూర్యనారాయణరాజు చదువునందు శ్రద్ధకలవాఁడు కాక వ్యర్థముగాఁ గాలమును బుచ్చుచుండెను. వేళకుఁబాఠశాలకుఁ బోవక, చెప్పెడు విషయములపై బుద్ధినిలుపక యిరుప్రక్కల నున్న బాలకులతోఁ గుసగుసలాడుచు వారిపాత్రములందిసి యొకరికిచ్చి యాయిరువురును గలహింపఁ దాఁజూచి యానం

దించుచు, వేళయెప్పుడగునాయని ఘటికాయంత్రమునే పలుసారులుచూచుచు నీలవేయుచు నెగురుచు దుముకుచునుండుట యాతని యలవాటులు. అంతియకాక పాఠశాలవదలఁగనే దేహపరిశ్రమము చేయుచోటికిఁబోవక యందందుఁదిరుగుచుఁ బ్రొద్దుపోయినపిదప నింటికిం బోవును. బీదబాలురు కొందఱు వాని తండ్రి తమకు సాయపడుచున్నందున నెట్లో యాతని వెంటనుండి యింటికిఁ బిలుచుకొని పోవుచుండిరి.

ఉత్తమ కక్ష్యలలోనికిఁ జొచ్చినపిదపఁ దలిదండ్రుల మాటలఁ గలలోనైనలెక్కింపక యిష్టమువచ్చినట్లు మెలంగసాగెను. విద్యకన్న వ్యాయామక్రీడలయందే యతనికి నభిరుచి హెచ్చఁజొచ్చెను ప్రథమోపాధ్యాయుఁడు కూడఁ బలుసారులు హెచ్చరించెను. కాని యాతని కావిద్యయందు వాంఛాపరివృద్ధియే కలుగఁజొచ్చెను. పాఠశాలకుఁబోవుటయు, వచ్చినట్లు పుస్తకమునఁ జిహ్నముపడఁగనే వేఱొకతావునకుం బోయి కాలముపుచ్చుటో లేక పడుకొని నిదురించుటో లేక యందందుఁ దిరుగుచుండుటో జరగుచుండెను. ధనవంతుని కుమారుఁడని కొన్నిదినములు బుద్ధిరాకపోవునా యని కొన్ని దినము లుపాధ్యాయు లుదాసీనత వహించిరి కాని పూటపూటకు సూర్యనారాయణరాజు నవినీతి హెచ్చుచు నితరులం గూడ నాకర్షించుచుండుటంబట్టి వారోపికల విడనాడిరి. మధుసూదన రాజునకు నెఱింగించిరి ఆతఁ డంతకుముందే కొడుకు దుడుకుతనములకు నేవగించుచునే యుండువాఁడు. కావున వారితో మర్మముగా మాటలాడక బాహాటముగాఁ దన తనయుని యత్యాచారములం దెలిపి భయపెట్టుడని వారిని వేఁడుకొనియెను. మీరుచేయు దండనము తీక్ష్ణమైన నాతఁడు పాఱి

పోవునేమో, లేకలేక కలిగిన సంతానము కాన నామనవి నంగీకరించి బుద్ధివచ్చునట్లు చేయుఁడని స్వాభిప్రాయమును వెల్ల డించెను. ఇంటియందును విద్యాశాలయందు నౌకరీతిగా నాతని ప్రవృత్తియున్నదని వారెఱింగిరి. నిర్బంధించి పాఠములు చెప్పసాగిరి. తోడిబాలురుకూడ సేవగింపసాగిరి. ఈ గురుతు లన్నియు వారి కనురాగము మున్నున్నయట్లు లేదని యాత నికిం దెలియఁజేసెను. సూర్యనారాయణరాజు బుద్ధిమంతుఁడు కావున నచిరకాలములోనే వానినెల్లగ్రహించెను. ప్రతిక్రియ చేయుటెట్లని యాలోచింపసాగెను.

ఆపాఠశాలయందు వ్యాయామక్రీడాసంఘ మొకఁడు కలదు. వానియం దుపాధ్యాయులు కొందఱు విద్యార్థులు కొం దఱునుండిరి. పద్ధతుల నిట్టివని తెలుపువా రుపాధ్యాయులు. వాని నాచరింపఁ జేయువారు, నాచరించువారు బాలురు. ప్రధానోపాధ్యాయుఁడు సర్వాధికార సంపన్నుఁడుగాన నద్దానికిం గూడఁ బైయధికారిగా నుండెను. కాలిబంతియాట, (Foot-ball) సుఖ కందుక క్రీడ, (Tennis) విలాస కందుక క్రీడ (Badminton) లోనగు వ్యాయామక్రీడలందుఁ గలవు. వానికిం గావలసిన పరికరములఁ దెప్పించి బాలుర కొసంగుట యుపాధ్యాయులపని. వానిని జాగ్రత్తగా నునిచి యుక్తసమయములయం దుపయోగించుట బాలురపని. ప్రతి దినము సాయంకాల మొకగంట యాయాటలకు సమయము. పాఠశాలకుం జేరిన విశాలభూభాగ మద్దానికిగా నియమింపఁ బడి యుండెను. దాని చుట్టును మూడుకోణములుగా నుండు నట్లు తాళద్రుమములు వేయఁబడియుండెను. అవి వృద్ధియై పశువులుకూడఁ జొరరాని యట్లుండెను. అన్ని యాటలకు

నందు వేలువేలు భాగములు గలవు. ప్రేక్షకులకు నుచిత స్థానములు గూడఁగలవు. వారా వేదికలపైఁ గూరుచుండి యా వినోదములం జూచుచుందురు నెలకొక్కసారి పందెములు పెట్టి వా రాడుదురు. ఇరుదెగలుగా నఫుడుందురు. గెలిచిన వారలకు బహుమానము లీఁబడు. అందులకువలయు ద్రవ్యము ధనవంతుల కడకరిగి సేకరించు భార ముపాధ్యాయు లదిగనే యుండెను. దానిని వ్యయించుభారము విద్యార్థులదిగా నుండెను. ఈసంఘము చక్కఁగాఁ బనిచేయుచుఁ బ్రేక్షకులకు నుల్లాసముఁగల్గించుచు బాలుర కుత్సాహశక్తిని బెంపొం దించుచు నుండెను. కావున దానికిఁ గావలసిన ధనము నెల్ల వారు నడిగిన తోడనే యిచ్చుచుండిరి. బాలురు ముచ్చట మీఱ నందుఁజేరి యుక్తప్రవర్తనము నేర్చుకొనుచుండిరి.

వ్యాయామక్రీడలు దేహబలము నొసంగ నేర్పఱుపఁ బడినవని కొందఱూహింతురు. కేవల మా కార్యమునకే కాదని నిపుణుల మతము. ఆయాటలయందుఁ దగిలియుండుట వలన నైకమత్యము పెంపొందును. ఒకప్పు డోడుచు నొకప్పుడు గెల్చుచు నుందురుగాన, బరస్పర విజిగీష యంతరించును. వేడు కకై యాడుచున్నవారమను భావము కలుగుటయే యద్దానికి గారణము. మఱియు సంఘముగాఁ జేరినఁగాని గొప్పకార్య మును దేనిని సాధింపఁజాలమను నుదారస్వభావము కలుగును. అదికలిగినవారు సాధారణముగా నితరులయం దసూయ గల వారుగానుండరు. అంతియగాక యొరులకు సాయము చేయుట మానవుని ధర్మమను సద్గుణము పట్టుపడును. చిల్లరగుణము లెన్నియేని నశించును. దేశసేవయు రాజభక్తియు రెండు నుత్తమగుణములను నిశ్చయము కలుగును. ఒరులు శ్రమం

పడుచున్నఁ దానూరక యుండరాదని తోఁచును. ఒక్కరికిఁ గల్గినది మేలుకాదనియు, నెల్లరకుఁ గలిగినదే మేలనియు భావించు శక్తి కలుగును. అది కొంతకాలము ఎల్లరియందు సోదరత్వమును గల్గించును. ఈగుణములు పట్టుపడిన యెడల నితర సద్గుణము లెన్నియో తమంతన యాబాలు నాశ్రయించును. వీని కన్నింటికిని సత్ప్రవర్తనము పేరొక్కఁడు ప్రసిద్ధంబయ్యె నని యెఱుంగవలయు.

ఇట్టియూహలతో నేర్పఱచిన యావ్యాయామక్రీడా సంఘమునందు సూర్యనారాయణరాజుకూడ నొకసభ్యుఁడుగా నంగీకరింపఁ బడియెను. ధనవంతుని కొడుకనియు, నిందుఁజేరిన యెడల దురభ్యాసములు పోవుననియు నూహించియే యందా తనిం జేర్చుకొనిరి. కొలఁదినెలలు గడచుదనుక నతఁడే వారికిఁ జిక్కులుకలిగింపక తనపనిని దాఁజూచుకొనుచుండెను. రాను రాను దనపై నుపాధ్యాయులు సద్భావముగలవారుకాక తన ప్రవృత్తిని మార్చుకొనవలయునని యెపుడు శాసింప నారంభించిరో, దానిచేఁ దోడిబాలురు తనయందు మున్నున్న యాదరమును విడనాడిరో యదిమొదలుకొని యందంతఱకలహములు కలుగఁజేయ నుంకించెను. ఏయుపాయముచే నది శక్యమాయని యాలోచింపసాగెను కొలదిదినముల కొక యూహతోఁచి యది మదికి సరిపడినందున నద్దాని నాశ్రయించి యుపాధ్యాయులకు బాలురకుఁగల చక్కని సంబంధమును బాఱఁదోల బద్ధకంకణుండయ్యెను.

ఒక్కనాఁ డొక్కయాట వేఱొకజట్టుతో నాడవలసి నట్లు నిర్ణయింపఁబడియెను. విద్యార్థులలో నింద ఱాడవలయు ననియు నేర్పఱుపఁబడియె. ఆయాటకై యువ్విళ్ళూరుచున్న

నిరువు రాదినమున నెన్నుకొనఁబడినవారి పేరులలోఁ దగులక పోయిరి. వారించుక త్వరపడు నలవాటుగలవారు. ఆవార్త సూర్యనారాయణరాజు చెవులఁబడియెను. మంచి సమయము దొరకెనని సంతోషించి యారేయి యింటికిం బోవక యేదో యొక కారణమున నిలిచితినని దలి దండ్రులకుఁ దెలియఁజేసి తనవంటివారిఁ గొందఱం బిలుచుకొని వారికడకేగి యేవో కొన్నిమాటలతోఁ గాలము గొంతపుచ్చి ఫలహారములఁ దెప్పించి వారును మిత్రులుఁ దానును భుజించి తాంబూలము నమలుచు మూఁడవదినమున బందెపుటాటగదా, దానింజూడ మాబంధువులు వత్తుమని వ్రాసిరని నొక్కి పల్కి యందులకు వారుత్సాహమును జూపకయుండు టెఱింగి మీపంతముల నాఁడుకదా చూడవలయునని యొకమాటను వదలి యద్దానికి బదులేమి వచ్చునో యని వేచియుండెను.

ఆయిరువురు మాఱుపలుకరైరి. సూర్యనారాయణరాజు పరిహాసముగాఁ గార్యము తఱి నెఱమగంటిమిఁ జూపుదుము. కాని ముందు పలుకనేల యనియా మీరూరకున్న వారని నుడి వెను. ఆయాటకు మాకును గాశికి రామేశ్వరమునకు నున్నంత దూరము కలదని విచారమును వెలిపుచ్చిరి. సందు దొరకెఁ గదా యని యెంచి మీమాట లచ్చెరువుగా నున్నవి. నేఁడు తెలుపకయున్న నానాఁడు తెలియకపోవునా? విదియనాఁడు కనఁబడని చంద్రుఁడు తదియనాఁడు తనకుఁదానే కనఁబడును గదా. చెప్పకయున్న మానె. మిత్రులముకదా యని యడిగితి నని యేమో గొణుగుకొనుచు నూరకుండెను. వారాతని మోముం గాంచి మిత్రమా! మాగ్రహచార మెల్లయెడల వ్యాపించినది. ఎవ్వరికిని మాపైఁ గోపముకలుగుచున్నది.

మమ్ము నిరుపుర నాయాటనుండి పాఱఁద్రోలిరి ఆచింతతోఁ దపించుచున్న వారము. మేమేమో దాచిపెట్టి మాటలాడినట్లు నీ వూహించితివి. ఇది మాదురదృష్టముకాదా యని వారు తమ యాశయముల వెల్లడించిరి.

ఆమాటలు చెవులఁబడిన తోడనే మండిపడుచు లేచి యేమీ! మీ పేరు లెన్నికొనఁబడలేదా. ఛీ! ఛీ! ఏమియాట? ఏమి యీపక్షపాతము? ఏల యిట్లు జరిగినదో తెలిసికొనవలయు. ఊరక విడువరాదు. నేఁడు గోరంతకు వచ్చినది రేపు కొండంతకు వచ్చును. ప్రతిక్రియ యూహింపక యున్న మించిపోవును. పిదప మనకందుఁ బ్రవేశమే లేకపోవును. గట్టిప్రయత్నము చేయవలయు. మీరూరకుండుఁడు. నేను నిలువఁబడి కార్యము నడపుదును. మిత్రులనందఱఁ బ్రోత్సహించి యికార్యమును నిర్వహించి యాసభ్యుల మొగములకు మసిపూయించెద. చూచుచుండుఁడు. అని వారిమోముల చిహ్నము లెట్లుండెనో యని గుఱితించి తనమాటలయం దాదరము చూపిన జాడలరసి యప్పుడే యచ్చటు వాసిపోయెను. వారు నీతఁడు ధనవంతుని కొడుకనియు నలువురు వంచకులఁగూడి యుండు వాఁడనియు నమ్మి కార్యమెట్టులైనఁ దమ కనుకూలముగా నెఱవేఱునని నమ్మిరి.

సూర్యనారాయణవర్మయు నెందో యారాత్రిశేషము గడపి మఱుదినమున పాఠశాలలోని విద్యార్థులను ఫలాహారము లిప్పించియు నించుక ధనమిచ్చియుఁ దనకు ననుకూలురుగాఁ జేసికొని వారలతో నీయుదంతము తెల్పి వారు తనయట్టి యభిప్రాయము గలవారు కాఁగా నపుడే వారందఱు నొక కట్టుగా నుండఁజేసి వ్యాయామక్రీడా కల్పితస్థలమునకుఁ

బోకుండఁ జేసెను వీరింజూచి మఱికొందఱు, వారింజూచి మఱికొందఱు నీరీతిగాఁ బెక్కండ్రు పోవమానిరి అంతియు కాక కేకలువేయుచు "సిగ్గు, సిగ్గు, సిగ్గు" అనుచుఁ దమయిండ్లకుం బోయిరి. ఉపాధ్యాయుల కిదేల కలిగెనో తెలియదు అందున్న వారినడిగిన వారును జెప్పజాలక యేమో తెలియదనిరి ఆనాఁడు వ్యాయామ కల్పితస్థల మే యల్పసంఖ్యాకుల చేతనో, సంవృత మయ్యెను. దానింగాంచి యందఱిది యేమి విపరీతమాయని వెచ్చుచూచ్చిరి. తదధికారి విచారించెను. కాని నిజమిది యని తేలలేదు.

ఆరాత్రి ప్రధానోపాధ్యాయుఁ డందలిసభ్యులం గొంద ఱుబిలువనంపి బాలకులలోఁ గొందఱసంతృప్తులై యున్న వారు. కతమేమని ప్రశ్నించెను. వారు గుటకలు మ్రింగుచు నానాఁడు విద్యార్థులనిరువుర రేపటి ఖేలనమునకు నెన్నికొనరైరి. వారా యాటలో మేటులు. వారియాటంజూడఁ గొందఱు రాఁదలంచి యుండిరి. వారు హతాశులైరి. వారిమిత్రులందఱు నొకజట్టు గాఁగూడి వ్యాయామ క్రీడాపరత్వమును విడనాడవలయునని తీర్మానించుకొన్నయట్లు పొడకట్టెడిని ఈపద్ధతి మనపాఠశాల యందీపఱకెన్నఁడును లేదు. అని వారూరకుండిరి. వారివాగ్ధోరణింబట్టి యందుఁ గొంద ఱాసంఘమునఁ జేరినట్లు కనుంగొని వారికి నించుక తద్విషయమున నభిమానమున్న చంద మూహించి యేమియు దండింపక వారిని బోవంబనిచి యుపాధ్యాయుల నందు సభ్యులుగా నున్నవారలం బిలువనంపి వారితో రహస్యాలోచనము చేయసాగెను.

ఉపాధ్యాయులకు సాధారణముగా లోకజ్ఞానము తక్కువ. నిరంతరము బాలకులతో వారికిఁ బ్రసంగము. వారల

బుద్ధిమంతులఁ జేయుటయందే వారి చిత్తములు బద్ధకంకణములై యుండును కావున వారు లోకవృత్తమును బ్రధానముగాఁ బాటింపరు. విద్యార్థులను విద్యావంతులనుగాఁ జేయుట యందే మనోవృత్తుల నెలకొలిపియుందురు. దానింగాంచి లోక జ్ఞాన ముపాధ్యాయులకుఁ దక్కువయని భావింతురు. అదియొక స్తుతియనియే తలంపవలయు నిరంతర మేకాగ్రమనస్కులై బాలకుల విద్వాంసులఁ జేయఁ బాటుపడుటకంటె నుత్తమ కార్య మేది కలదు? దానినిమించిన లోకజ్ఞాన మేది యుండును? ఇతరులను వంచించు వృత్త ముపాధ్యాయులకు లేనికతన లోక జ్ఞానరహితు లందురే నయ్యది వారి కలంకారమే యగును. అట్టి యలంకారమే వారికి శాశ్వతయశము నొసంగుఁగాక. సర్వవిషయముల నెఱింగి యుండుట మంచిదియే కాని వీరికట్టి యవకాశ మద్దాని కొఱకుఁ గృషిచేయ లభింపదు. కావున లోకవృత్తాంతజ్ఞాన శూన్యులే యగుదురుగాక. మూఢులఁ బండితులనుగాఁ జేయుచు వారిని లోకజ్ఞాన సంపన్నులను జేయుచునుందురుగాక.

వ్యాయామక్రీడాసంఘసభ్యులగు నుపాధ్యాయులంద ఱతోఁ బ్రధానోపాధ్యాయుఁ డాలోచించుచుండఁగాఁ గొందఱందుఁ బౌరుషమును జూపవలయుననిరి. కొందఱు సామముకూడ దాని కనుగుణముగా నుండవలయుననిరి. సామ మున మనము వారితో ముచ్చటించిన మనగౌరవము చెడునని మఱికొంద ఱుపన్యసించిరి. పిఱికితనమున వారిట్లు కట్టుకట్టిన నిది యితర బాలురకుంగూడ నుదాహరణమై తుదకు మనయధి కారమునకే మోసమువచ్చునని యింకను గొందఱు పట్టుపట్టి వాదించిరి. తుదకు దండోపాయమున వారి లోఁబఱచుకొనఁ

ప్రయత్నించుట లగ్గనుటయే సిద్ధాంతమయ్యెను. మఱుదినము వారిని బాఠశాలనుండి తఱిమివేయవలయు ననుమాట యంగీకృతమయ్యెను. సభ చాలించి యెవరిండ్లకు వారు పోయిరి.

మఱుదిన ముదయముననే పాఠశాల వాకిటయందే యొక ప్రకటన పత్రము దృగ్గోచర మయ్యెను. "బాలకుల శాంతింజెఱుపఁబూనిన కొందఱు బాలురను బాఠశాలనుండి త్రోసివేయుచున్నాము. ప్రవృత్తి మంచిదిగాకుండుటయే వారి కీయిడుమ రాఁగారణము. వారివలన నెల్లరకు దురుద్దేశములు పట్టుపడునని తోఁచినందున నీకార్యము చేయవలసి వచ్చెను. వారును దమయపరాధముల నివేదించి క్షమింపుఁడని వేఁడిన నాలోచింపఁబడును. పాఠశాలాధికారి." అని యందుండెను. ఒక్కరొక్కరుగా వచ్చి బాలకు లాప్రకటనము గాంచి భయంపడువారును, కానీ చూతమనువారును, మఱింత పట్టుదలఁ జూపవలసినదేకాని లొంగరాదనువారును, దమ తప్పుల నుపాధ్యాయు లొప్పుకొన్నఁగాని మరల నీపాఠశాల మొగముకూడఁ జూడరాదనువారును, అందఱెట్లో మనమట్లే ప్రవర్తింతమనువారునుగా బాలురెల్లరు వచ్చుచుంబోవుచు గుసగుసలాడుచు నొకరి నొకరు హెచ్చరించుచు నాగ్రహించుచుఁ బండ్లు గీటుచు మోము చిట్లించుచు నుపన్యసించుచు నీదినము పాఠశాల కెవ్వరు పోవరాదని ప్రమాణములు చేయించుకొనుచుఁ గలవరపడుచుండిరి. గ్రామమునఁగల పెద్దలెల్ల నేమియు ననఁజాలక కొందఱుపాధ్యాయులను మఱికొందఱు బాలురను నిందించుచుండిరి. ఆదినము వేళ కొక్కఁడైన రాఁగూడదని బాలురు చాటుచుండిరి. గ్రామమంతయు నీ వార్తలతో నిండియుండెను.

సీతారామరాజీవార్త నాలించి యిట్టు లాలోచించెను. ఉపాధ్యాయులు పట్టుదల వహించిరి. బాలకులు మొండిపట్టు పట్టియున్నారు. ఇరువురు బాలుర నెన్నుకొనకున్నంత మాత్రమున గొప్పలోప మేమియు లేదు. ఈ యాటలు నెలకొక్క పర్యాయము సాగునవియే. వారంత ముచ్చటపడినపు డుపాధ్యాయు లాలోచించి వారిని బిలువంబంచి మంచిమాటల నూఱడించిన వారంగీకరించి యుందురు. నాయెఱింగినంత వఱ కాయిరువురు బాలకులు మంచి ప్రవర్తనము కలవారే. వారిచిత్తముల కింత యాగ్రహము కలుగఁజేసినవా రెవ్వరో తెలియరాదు. తొలుతనే వారి నిపర్యాయము మీరు మానుఁడు, ఇంకొక తడవ మిమ్ముఁ దప్పక యెన్నుకొనుదు మని వారికిం దెలిపియున్న బాగుండెడిది. బాలకులెవ్వరు నాపనికిఁ గడంగరైరి ఇట్టికలహము లూరకే కలుగవు. సూత్రధారుఁ డొకఁ డుండినఁగాని యీనాటక మింతగా సాగదు. పాఠశాల యందుఁ బఠించు బాలురలోఁ గలహప్రియులు నామదికిం దట్ట లేదు. సూర్యనారాయణరాజొక్కఁడె యట్టివాఁడని తలంచి యుంటిని. ఆతఁడు నీనడుమ దుర్వినీతుఁడై యిచ్చకువచ్చినట్లు మెలంగు చున్నవాఁడని మిత్త్రులు పెక్కండ్రు నాతోడ మందలించిరి. మనకేల యాతనిజోలి యని వారికి బదులు చెప్పితిని. ద్రవ్యము, వయస్సు, పీనికిందోడుగా నవివేకిత్వము, కొలఁదిగనో గొప్పగనో ప్రభుత్వమునను నీనాల్గింటిలో నొక్కఁ డొక్కఁడే యనర్థమును బుట్టించు ననఁగా నీనాలుగు కూడియున్నఁ జెప్పవలసినదేమని పెద్దలుపలుకఁగా వినియున్నాఁడను సూర్యనారాయణవర్మతండ్రి ధనవంతుఁడు. ఇతఁడాతని కేకపుత్త్రుఁడు. ఇతనికి వయస్సంకురించినది. కొలఁది గ్రామము

లున్నందున నేమాత్రమో యధికార మున్నదనవచ్చును. ధనము వలసినయంత కలదు. అవివేకిత్వసంపదయుఁ గలదనుట కేశంకయులేదు. కావున నీతఁడు చేయరాని దుష్కార్యము లుండవు. ఈనడుమ నీతఁ డింటికింగూడ రాక కుముదవల్లిలోనే యున్నట్లు విన్నాఁడను. ఈవిషయమునఁ గృషి చేయుట కొఱకే కాఁబోలు. ఇప్పటి దుష్టబాలురందఱు నతని మిత్ర మండలమునఁ జేరినవారలే. ఈతనివలని ధనము సంపాదించు వారలే. ఈకుతంత్రమెల్ల నీతనిదే యని యిపుడు దృఢపడు చున్నది. ఇదింతటితోఁ దీఱదు. ఎన్నియో యనర్థములను గల్పించును. ఇట్టి దురభ్యాసములు పట్టుపడరాదు. పట్టుపడు నేని వదలవనుట సత్యము. వీనినెల్లఁ దొలఁగించు నుపాయము నేనేమైనఁ జేయఁగలనా? ప్రయత్నము చేసినఁగాని యది తేలదు. ప్రయత్నము ఫలింపకున్న నొకచింత మనస్సునఁ బాదు కొనును. అది నిరంతరము నన్ను బాధించుచునే యుండును. అట్టులని యూరక యుండరాదు. ఊరకయుండుట కాపురుష లక్షణము.

"శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించిపరిత్యజింతురురువిఘ్నాయత్తులైమధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచుఁ ధృత్యున్నతో
త్సాహులై, ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞా
నిధుల్ గావునన్."

అన్నసూక్తి సర్వసమ్మతమే యగుఁ గదా. కావున నాయోపి నంతవట్టు ప్రయత్నించి చూచెదను.

అని కృతనిశ్చయుఁడై యప్పుడ జనకునానతిం గైకొని కుముదవల్లికిం బోయి యందుఁ దనమాట నాదరించు బాలురఁ

గలిసికొని యథోచితముగ మాటలాడి వారి మనస్థితిఁ దెలిసికొని యప్పటివారికోపము కల్పితమని యెఱిఁగి మెలమెల్లన గురుశిష్యన్యాయము బోధపడునట్లు మాటలాడఁ బూనెను. మిత్రములారా! పెద్దలమాటల నాలకించి వారి యనుమతి చొప్పున మెలఁగుట బాలుర ధర్మము. దాన నెంతయో మేలు చేకూరును. అనేకవిషయముల ననుభవపూర్వకముగ నెఱింగినవా రుపాధ్యాయులు. మనకట్టి యనుభవములు లేవు. వారికిఁ గొందఱయందుఁ బక్షపాతము గలుగవలసిన యక్కఱయే లేదు. మన మింతకాలమునుండి చూచుచున్నాము. ఒక్క కార్యమునఁ బెక్కండ్రు ప్రవృత్తులైన నొక్కనికే ఫలము కలుగును. తక్కినవారు దుఃఖపడవలయునా? ఆ ఫల మాతని కేల కల్పించితిరని యుపాధ్యాయుల నాక్షేపింపవచ్చునా? ఇందేదియు యుక్తముకాదు. ఇప్పటిస్థితి యట్టిదేకదా. ఈస్వల్ప విషయమున కిట్టి దుష్ప్రయత్నము చేయఁదగునా యోజింపుఁడు. తుదకు శాంతికి లోపమేకాని కాఁదగిన ఫలమేమియు లేదు. ఆయిరువుర విషయమై యుపాధ్యాయులకుఁ బక్షపాతమున్నదని యెట్లు చెప్పవచ్చును? ఎన్నుకొనువారు విద్యార్థులే కదా? ఉపాధ్యాయులు పురికొలుప వారిని ద్రోసివేసిరనుట వ్యర్థాలాపము. అపుడు విద్యార్థులబుద్ధులేమాయె? మీరునీవిషయమై యించుక మనశ్శాంతిగలిగి యూహింపుఁడు. ఇట్టి కట్టుపాటు మంచిదా కాదా యనియు నాలోచింపుఁడు. లోకులు మనలఁ జూచి యేవగింతురు. తల్లిదండ్రులు చింతింతురు. పేలతనమున మనమిట్టి జోలికింబోయితిమని యెల్లరు పల్కుదురు. లోకాపవాదమునకు భయంపడవలదా? "లోకాపవాదాద్భయ" మ్మన వినమే. సత్కీర్తిని సంపాదింపంగోరికదా మన

పూర్వులు సర్వస్వము వదలుకొనిరి. మనము నిన్న గాక మొన్న నేకదా యట్టి పాఠములఁ జదివితిమి. ఇంతలో మఱచితిరా? మీరును సావధానముగా యోజింపుఁడని చక్కఁగా నుపన్యసించెను.

తమమిత్రుని వాక్యమ్ముల వారాలకించు కొలఁదిని వారికిం బట్టుపడియున్న మచ్చరము పట్టుదలయుఁ దగ్గఁ జొచ్చెను. సీతారామవర్మ యుపన్యాసము మానిన కొలఁది నిముసములకే వారిమోహములు కలంకి దేఱెనట్లయ్యెను. వారెల్ల నొక్క మాటగా నాపట్టుదలను మానితిమనిరి. నీవంటి మిత్రుఁడు మాకు వేఱొక్కఁడు దొరకునే యనిరి. అందొక రిద్దఱు మేమిపుడ పోయి తొలుత విషాదము నొందిన విద్యార్థులకుఁ దెలుపుదుమనియు వారిని బ్రసన్నులగునట్లు లోనరించికాని రామనియు శపథము చేసిరి మీ రిక్కార్యము చేయుఁడని వర్మ మఱింత గట్టిగాఁ జెప్పెను. వారును బద్ధకంకణులై బయలు వెడలిరి.

కాలము భగవత్స్వరూపము హానియుదంతము నెఱంగినవారు లోకముల నరుదుగనుందురు. భగవత్తత్త్వమెఱింగినవారు కాని కాలతత్త్వ మెఱుంగఁజాలరు. దానియందట్టిమాహ్వలిప్పుడు కలుగునని యెవ్వరును జెప్పఁజాలరు. కాలమే సర్వకార్యములకు నాధారము. అట్టికాలమును గ్రమము తప్పక యారాధించువార లఖండలక్ష్మీధురంధరులగుదురు. కాలము నారాధించుటనఁగాఁ బూవులతోఁ బూజించుట యనికాదు. చేయఁదగుపని నాలసింపక చేయుట యని యర్థము. ఏకాలమున నేపని చేయఁదగునో యద్దాని నాకాలమునకు శ్రద్ధకలిగి చేయువా రెవ్వరో వారలే యఖండలక్ష్మిని బడసి సుఖింపఁ

గలరని సారము. కొందఱు వేళకు సరిగాఁ జేయఁదగినదానిని జేయక యెప్పుడో యొకప్పు డద్దానిం జేయుదురు. వారికడ లక్ష్మి నిలువదు. మఱికొంద ఱాచారవంతులమని చెప్పుకొనుదురు వారు దరిద్రులుగనే యుందురు. కారణ మేమనఁగా వారు ప్రాయశః సకాలమున నాయాకార్యములను జేయరు. ఇట్టి యాచారవంతులను లక్ష్మి యాశ్రయింపక యాచారవిహీనుల నాశ్రయించునని పెక్కం డ్రాక్షేపింతురు. కాని వారికద్దానికింగల హేతువిట్టిదని తెలియలేదనవచ్చును. ఆచారము, దానము లోనగునవి సత్కార్యములే. అవి భగవంతున కిష్టములే. ఐన నట్టివారిని వదలి లక్ష్మి యితరుల నాశ్రయించుటేలయని యడుగుదురేని యితరులని మీరనువారు కాలము నారాధించువారు. కాలము నించుకంతయు వృథ చేయక కార్యములను జరపువారు. కాలము భగవత్స్వరూపమే కాన వారు భగవంతునే యారాధించువారలగుట మహాలక్ష్మి వారియెడఁ బ్రసన్నురాలగుట యొక వింతగాదు. ఆఙ్గ్లదేశీయులు సంధ్యాద్యనుష్ఠానముల జరపువారు గాకున్నను కాలమునే ప్రధానముగా భావించువారు. కాలము మన్నించుటయే భగవంతు నారాధించుటయని యర్థము. కావున భగవంతునిపయి భక్తి గలవారలయెడ మహాలక్ష్మి యనుగ్రహము కలదిగ నుండుట న్యాయమే కదా. అట్టులగుటంజేసి యాంగ్లదేశీయులు సకల భూభారవహనక్షములైరి. అదియెఱుంగక కొందఱాక్షేపింతురుగాని వారొనరించు సత్కార్యముల నెఱుంగరు. ఇదియే కాలారాధనపద్ధతి.

ఆవిద్యార్థులు సీతారామవర్మకడ మాటయిచ్చినట్లే పోయి ఖిన్నులైయున్న విద్యార్థులకడకుం బోయిరి. వారు

యథాపూర్వముగాఁ జదువుకొనుచుండిరి. వీరింజూడఁగనే యాదరించిరి. నవ్వుచునే మాటలాడిరి. వీరందుల కచ్చెరువుపడి యిదేమో విచిత్రముగనున్నదే యనిరి. మీ ఖేదమును దెలియఁ గోరి వచ్చితిమనిరి. మాకు విన్నదనమేమి కలదు? అని వారు ప్రశ్నించిరి. పరస్పర మించుకతడ వీసంభాషణము సాగించిరి. రాయబారుల కిది నడుమ నెవరో కల్పించినదే కాని వాస్తవముగ నేమియు నిట లేదని తెలిసెను. మర్మము లేక తమ వచ్చినపని వారి కెఱిఁగింప వారు పక్కున నవ్విరి. ఈచిక్కులు మావలనఁ గలిగినవి కావనిరి. మాకిపుడు విచారమే లేదనిరి. మమ్మెన్నికొనక పోయినపు డించుక మనఃఖేదము కలిగెను. ఉత్తర క్షణమున నడంగెను. విద్యార్థులు కట్టుగాఁ బాఠశాల మానుట మేమును వినియే యూరకయున్నారము. అంతియ కాని మేమందులకుఁ గారణభూతులము కాము. అను నీమాటలు వారినోటనుండి వెడలఁగనే రాయబారు లెంతయో సంతోషము మోములఁ గలయఁబర్వఁగా మేమరిగి సీతారామవర్మకుం దెలిపి యనంతర కార్య మొనరింతుమని వారియనుమతి నొంది వేవేగవచ్చి యయ్యుదంతమంతయుఁ దమ మిత్రునకుం దెల్పిరి. ఆవార్త యమృతధారవలె శ్రుతిపుటపేయము కాఁగా వారిని మఱికొందఱను బిలుచుకొని పాఠశాలాధికారికడకుం బోయెను.

సహోపాధ్యాయులం గూడి కర్తవ్య మాలోచించుచు నతఁ డుండెను. సీతారామవర్మ మిత్రులంగూడి వచ్చినాఁడని సేవకుఁడు తెలుపఁ బట్టరాని యానందమున "అబ్బాయీ! ర" మ్మని పిలిచెను. ఎల్లరు లోపలికిం బోయి వారియనుమతిని గూరుచుండిరి. వీరిరాకచే నుపాధ్యాయుల

చిత్తములు సుంత రంజిల్లెను. ప్రధానగురువు వర్మతో నీయాగమనమున నీచిక్కులు తీఱునని తలంచుచున్నాఁడను. మిగుల బుద్ధిమంతుఁడవు. నీవర్తనమే నీపేరును బ్రకటింపఁ జేయుచున్నది. అని పలుక వర్మయుఁ జేతులొగ్గి గురువులు శిష్యుల నిట్లుగ్గడించుట న్యాయముకాదు. అనుగ్రహమున నాశీర్వదింప వలయును. అదియే మాకు శ్రేయస్సు. అని పలికి తన ప్రవృత్తి నెల్ల నెఱింగించెను. ఆయుపాధ్యాయు లెల్ల విస్మయంపడుచు నప్పుడ వర్మ మిత్రులగు రాయబారులంబంపి తోలుతటి విద్యార్థులను రావించెను. వారింగూడి మఱికొందఱు వచ్చిరి. విద్యార్థులు పెక్కండ్రు పోవుచున్నారే యని మఱికొందఱు వారి వెంటఁ బోయిరి. రెండవ జాము చివరభాగమునకు మూఁడు వందలు విద్యార్థుల సంఖ్య పాఠశాలయందుండెను. సభాస్థానమున నెల్లరంగూరుచుండ నియోగించి వేదిక నెక్కి మాటలాడుమని వర్మను బాఠశాల ప్రధానోపాధ్యాయుఁడు నియోగించెను. వేదిక పైకి సీతారామరాజు రాఁగానే కరతాళధ్వనులు మిన్నుముట్టెను. అంత నతఁ డిట్లు ప్రసంగించెను.

సోదరరత్నములారా! గురువుల యానతిం గొని నాలుగుమాటలు మీయెదుటఁ బల్కెదను. చక్కఁగ నాలకింపుఁడు మన మీపవిత్రగృహమునకు వచ్చుట విద్యావంతుల మగుదు మను నూహచేతనేకాని కాలక్షేపమునకుఁ గాదు. తల్లిదండ్రులు మనము విద్యావంతులమై యశస్సు నార్జించి తమకు వార్ధకమున నుపచరింతుమని యువ్విళ్లూరుచుందురు. సకలకష్టములకు లోనై మనలఁ బెంచిరి. మనము కృతజ్ఞులమై వారిఋణమునఁ గొంతయైనఁ దీర్చుకొనవలయును. అదియే మనకుఁ గర్తవ్యము. దాని నెఱవేఱునట్లు చేయకున్న

మనజీవితము వ్యర్థము. ఇది పెద్దలనుండియు మీవంటి బుద్ధిమంతులగు సోదరులనుండియు నేను నేర్చుకొన్న మార్గము. ప్రకృతమనుసరించెదను. ఒక్క కార్యమునఁ బెక్కండ్రు ప్రవర్తించినచో నందు జయ మొక్కరికే కలుగును. తక్కినవారు వానికేల జయము కలిగెనని యసూయపడరాదు. అట్టి దుష్కార్యమునఁ బ్రవర్తించిన లోకప్రవృత్తియే సాగదు. ఇది యందఱకుఁ గలుగునదియే. కావున నీమార్గమే ప్రబలిన నొక్కరి కొక్కరికి సంబంధమే లేకపోవును. అట్లు చేయక జయమందినవారిని మనము ప్రేమించిన నింకొక్కసారి వీరి నతఁడు ప్రేమించును. దానిచేఁ బరస్పర స్నేహము వర్ధిల్లును. స్నేహలతను అసూయాలవిత్రముచేఁద్రెంచివేయఁ బూనరాదు. దాన నేనాఁటికిని మేలు చేకూరదు.

మన విషయమున నిట్టి యసూయాప్రవర్తన మిపుడు సాగుచున్నది. అది నవ్వు పుట్టించుచుఁ గ్రమక్రమముగాఁ బెద్దల యనుగ్రహమును మనకు దూరము చేయుచున్నది. గురువులపైఁ దిరుగఁబడ నింకొక్కరిని బురికొలుపుట నింద్యము. స్వలాభనాశనకరము. కలకాల మయశస్కరము. భీకరలోకాపవాద సంపాదకము. కావున మనమక్కార్యమునఁ బ్రవర్తింపరాదు. ఇప్పటి యీయకార్యము నింతకంటె నొక్కింతయు విస్తరించి పచింపరాదు. అట్లు చేసిన మనల మనము నిందించుకొనినట్లగును. ఈ కొలఁది గంటలకే మన యత్యాచారము నలువురమనస్సుల కెక్కినది. వారి హృదయభావము నోళ్లనుండి వెడలకముందే మెలఁకువపడవలయును. మన తెలివితేటలిపుడే కనఁబడును. మీ రెల్లరు నాకంటె విశేషించి బుద్ధిమంతులరు. మీకుఁ దెలుపఁదగినంత యోగ్యత నాకు లేదని

యెఱింగియుఁ గురువుల యానతి మీఱరానిదని యీనాలుగు మాటలు చెప్పితిని. త్వరపడి మనము మేలుపొందు మార్గము నాలోచింపవలయును. మీరంగీకరింతురని నమ్మి మీ యనుమతి కలుగునని నాస్థానమునకుఁ బోవుచున్నాఁడను.

సీతారామరాజు వాక్య మొక్కొక్కటియు నొక యమృతబిందువువలె విద్యార్థులకుఁ జెవుల సోఁకెను. అంతటఁ బ్రధానోపాధ్యాయుఁడు లేచి నిలువంబడి యిట్లు బాలురకు నుపదేశించెను. ప్రియబాలకులారా! మనస్సుల నీవిషయము నందే నిలిచియుండఁజేసి యాలకింపుఁడు. పాఠశాలయందుండు నంతదాఁక మాకు మీకు గురుశిష్య న్యాయము కుదురుగ నుండవలయు. దీనిందాఁటగనే సోదరన్యాయము పాదుకొన వలయు. దీనిచే మీకు మిక్కిలి మేలు గలుగును. మాకు మీ మేలే పరమలాభము. మాకడఁ జదువుకొని బుద్ధి మంతులరై మీరు ప్రవర్తించినఁ జూచి మేమానందింతుము. ఇంతకంటె నెక్కుడు లాభమును మేము కోరము. ఈలాభ మును మీవలనఁ బొందఁ గోరుదుము ఈమాత్రము లాభము మీరు మాకుఁ గలిగింపఁగూడదా? దీనికే గురుశిష్య న్యాయ మనియుఁ బేరు. మీరు కూడ మావలనఁ గఱచిన విద్య పెంపున సర్వజనసమ్మత ప్రకృతిగాంచిన నదియే లాభము. ఆలాభము మీకుఁ గల్గింప మేము కోరవలయును. ఇట్లు కోరమేని యిరువురము స్వధర్మము నిర్వహించినవారము కాక యుందుము. అపుడు మన కిరుదెగలవారికిని సుఖము లేదు.

ఒక్క కుటుంబము నందుండువారు నొక్కరి మాట చొప్పున బ్రవర్తించినఁగాని పని సాగదు. ఎల్లర వాంఛ లొక్క కార్యమున ఫలింపక పోవచ్చును. దాన నాగృహాధిపతికిఁ

బక్షపాతము కలదనవచ్చునా? ఇంటిపెత్తనముఁ బూనువాని కనేక కష్టము లుండును. ఎల్లరను సంతోషపఱుపవలసిన భారమాతనిపయి నుండును. దేహమంతయుఁ గన్నులుగాఁ జూచినను గొందఱకు మనస్సంతృప్తి లేకుండ నుండవచ్చును. కాని యాయజమానుని మనఃక్లేశము విచారించిన నేమనుటకు నోరాడక యుండును. ఇవి మీరెఱింగిన దేకాని క్రొత్తది కాదు. మాకీపాఠశాలయే కుటుంబము. మీ క్షేమమే మా క్షేమముగా భావించుచుందుము. ఐన నెల్లరకు నొక్క విషయమున సంతృప్తిని గలిగించుట సాధ్యముకానిపని. మీలోఁగొందఱిత రులు ప్రోత్సహింప మూర్ఖత్వమును వహించిరి. ఇందులకుఁగల కారణ మిదియని యెఱుంగనేరకయున్నాము. మేము విన్నంతలో నీపత్తుకూడ మాలోపము కానరాదు. ఒక్కయాటకుఁ బదునొకండుగురు బాలురుండవలయును. తక్కినవారెల్లమమ్మేల యెన్నికొనలేదన్న మేమేమని బదులుచెప్పవచ్చునో మీరే యించుక యోజింపుఁడు. ఆసంఘమునం దుపాధ్యాయుల సంఖ్యకంటె విద్యార్థులసంఖ్యయే యధికము. నెలకొక్కసారి యట్టియాట సాగుచుండును వరుసగా నెల్లరకు వంతు వచ్చును. విద్యార్థులే వీరియాట యాడవలసినదని నిశ్చయించి నపు డుపాధ్యాయులు పక్షపాతమూనిరన్న బదులేమని చెప్ప వచ్చును? ఈవిషయమున మేమును జింతింపవలసినవార మైతిమి. స్వల్పవిషయములఁ గొండంతలుచేసి యెవ్వరో సోమరులు తెలిపిన దుర్వచనములకు లొంగి బుద్ధిబలములు బోనాడి యిట్టి కట్టడికార్యముల నవలంబించుట లగ్గుగాదని తెల్ప సాహసింపవలసివచ్చినది. నలువురు విన్నదానిని వేయిమడుంగులు చేసి చెప్పుకొందురు. అందలి సత్యాసత్యములు పామరు

లెఱుంగక వానినెల్ల నమ్ముదురు. దాన వ్యర్థముగ మనకపకీర్తి కలుగును. దీనికి మూలము మన యల్పదృష్టియే కాని వేఱు గాదు. కుడిచి కూరుచుండి యపవాదమును భరించుట మన గ్రహచారమే యనవలయు. కావున మీరెల్లరు నాలోచించి మాలోపములున్నఁ దెలిపి మీలోపములఁ దెలిసికొని వానిని తొలఁగించుకొని వర్తింపుఁడని మాయాశయమును దెలుపుచున్నవారము. మోమోటమి మాని మీమీ హృదయభావములఁ దెలియఁజేయుఁడు. మాకు మీయందించుకంతయు నాగ్రహము లేదని మాత్రము మఱియొక్కసారి తెలియఁ జేయుచున్నాము.

అని ప్రధానోపాధ్యాయు లుపన్యసించి తమ పీఠమునఁ గూరుచుండఁగా నెల్లరు నిశ్శబ్దముగా ముహూర్తకాలముండిరి. ఆవల గుసగుస లారంభమయ్యెను. కొలఁది నిమేషముల కయ్యది విచారముగా మాఱెను. తుదక శ్రుబిందుపతనముగా నయ్యవి చూపట్టెను. ఒక్కవిద్యార్థి లేచి డగ్గుత్తికతో మహాశయులారా! యిందెవరివలనను దోషము కానరాదు. వ్యర్థముగఁ గుత్సితుల మాటలు వినినందున నియ్యనివార్యాపయశము ప్రాప్తించెను. సూర్యనారాయణరాజు పన్నిన పన్నుగడయే యిది. మేమెల్లరము దానికి దాసులమైతిమి. దీని నాలోచింపఁగాఁ బురుషప్రయత్నమునకంటె దైవము మహత్తరమని స్పష్టమయ్యెడిని. జరగినదానిని మరల స్మరింపక యథాపూర్వకముగాఁ బ్రవర్తించుట యిపుడు చేయఁదగినపని. నేఁడు విడుమర యనుకొందము. మామానసములు పావనములయ్యెను. కర్తవ్యమెట్లో గురువులే యుపదేశింప నర్హులు.

అనఁగనే కరతాళధ్వనులు మిన్నుముట్టెను. రవంత సేపెవ్వరిమాటలును జొరఁబాఱఁ జాలవయ్యెను. అంత నుపాధ్యాయప్రవరుఁడు లేచి యిట్లు చెప్పెను. ప్రియబాలకులారా! మీయాశయములఁగల తత్త్వము తేటపడియెను. మేమెల్ల నొక్కమాటగా మిమ్ము వంచింతుమని మీరును మీరెల్లఁ బట్టుదలతో మమ్ము వంచింతురని మేమును జొరపడితిమి. దీన నింతపుట్టె. నలువురనోళ్లలో మనపేరులు నానుటయే ఫలముగా నిక్కార్యము చెల్లె. ఈశ్వరానుగ్రహమున నింతటనైన మేలుకొనఁగల్గితిమి. ఈదుష్కార్యమునకు సూర్యనారాయణవర్మ ప్రధానుఁడని స్పష్టమయ్యెను. ఆతని దుర్బో ధమే యింతపని సాగించెనని మీమాటలంబట్టియే యిపుడు తెలిసెను. ఇందెవ్వరి యపరాధ మిసుమంతయుఁ గానరాదు. జరిగినదానికై యిపుడు విచారించి లాభములేదు. మీరు మేమును దీని మఱచిపోవుటయే యిప్పటిపని. రేపు యథాపూర్వముగాఁ బాఠశాల పనిచేయును. సకాలమున మీరెల్ల నిందుఁ గూడఁదగు. ఇఁకముం దిట్టి యిక్కట్టులు గలుగక యుండఁ గట్టుబాటు లొనరించుట న్యాయము. కందుక క్రీడా సంఘమునం దుపాధ్యాయు లిరువురు విద్యార్థులు పదునాలుగురు సభ్యులుగా నుండవలయు. నేనును మీకు సాయపడు చుందును. ఏయాటకుఁగాని ప్రతినిధుల నెన్నుకొనుట విద్యార్థి సభ్యుల పనియే. ఉపాధ్యాయసభ్యులు వారికి సాయపడుచుఁ గలహములు రాకయుండఁ జూచుచుందురు. ఈపద్ధతిచే నిట్టి యిక్కట్టులు రాకయుండఁ గలవని నమ్ముచున్నాఁడను. భగవంతుని సాయము విశేషించి యిక్కార్యమునఁ గలుగుఁ

గాక అని పలుకఁగా నెల్లరు సమ్మతించిరి. సభ ముగింపఁబడఁగా నెల్లరు తమతమ యిరవుల కరిగిరి.

---

# మూఁడవ ప్రకరణము.

---

కుముదవల్లికిఁ దూర్పు భాగమున రెండు క్రోశముల యంతదవ్వున నొక యడవి గలదు. దానిపొడవు యోజనము, వెడల్పు గవ్యూతిమాత్రమునై యుండెను. అందు గ్రామములు లేవు. అడవియను పేరు దానికిం జెల్లునా యని పెక్కండ్రు సంశయించి యెందఱనో ప్రశ్నింతురు. కాని పెదవి విఱచుటయే యందులకు సమాధానము వచ్చుచుండును. అందు విశేషించి సహకార తరువులు (తియ్యమామిడిచెట్లు), కొబ్బెరచెట్లుండును. ఎన్ని ఫలవృక్షములు లోకమునఁగలవో యన్నియు నందున్నవని పాఠకులు నమ్మవలయును. ఒక్కొక్క తావున నెన్నియో పేరులుగల యరఁటిచెట్లుండును. అందొక్క జాతిది పొట్టిగా నుండును. దాని గెలమాత్రము దానికంటె మూరెడుపొడవు మిక్కిలిగా నుండును. కావున దాని మూలమునఁ ద్రవ్వియుందురు. ఆగెల యా బొరియలోనికి దిగి యుండును. ఆగెలయందు లెక్కించిన మూఁడువందల పండ్లుండును. వానికి వామనకేళులని పేరు. చిటికెనవ్రేలంత పరిమాణముగలవి కొన్ని గలవు. అవి భక్షింపఁ దనివితీఱదనుట నిక్కువము. వానిని గిన్ని పండ్లందురు. ఇట్టివెన్నియో పేరులు గలవి యందుఁ బొడసూపును. విశేషించి పెంచి వ్రాయనేల?

భూగోళమున నేయే భాగముల నేయేఫలము లుండునో అవియెల్ల నందుండుననుట వాస్తవము. పుష్పవృక్షము లట్లే యందుండును. లతాకుడుంగములు గలవు. ఛాయామహీరుహములు కూడ నందుఁ గలవు. అవి నాలుగు ప్రక్కల విశేషించి యుండును. అందందును గానఁబడును.

ఇట్టులుండియు నయ్యది యడవియనుపేరునుమాత్రము పోఁగొట్టుకొనఁ బ్రయత్నింపదయ్యెను. నందనవనమనియో, ఖాండవమనియో, చైత్రరథమనియో, మఱియు సుందరారామమనియో పేరుపెట్టఁదగియుండెను. ఆవనమున నొకయోగి యాశ్రమమును గల్పించుకొని యుండెను. దానినడుమ నాపర్ణశాలయుండెను. దానికి దక్కినపుఁబ్రక్కన నొక జలాశయము గలదు. దానికించుక యగ్నిమూల నొకకుండిక కలదు. ఆకుండికకు మార్కండేయతీర్థమని పేరు. అర్ధచంద్రాకారముగా నయ్యది యమరియుండుటచేఁ గుండిక యనఁబడియెనని కొందఱందురు అది యగాథమను ఖ్యాతిగాంచెను. అందు జలజంతువులు విశేషించి కలవుగాని పాములు, మొసళ్లు, కర్కాటకములు మాత్రము కలికెమునకుంగూడ లేవు. అదియే మార్కండేయుని యనుగ్రహమని కవులు వర్ణింతురు. దూరమాలోచింప నేదోయొక కారణము గలుగక యవిలేకుండ నుండు నవకాశము లేదని పెక్కండ్రూహింతురు. దానిజలము యమునోదకముం బోలియుండును. లోఁతుగా నుండుటచే నట్లగపడును గాని జలములకు రంగు లేదని పౌరాణికులు వాకొనుదురు స్థలము ననుసరించి రంగుగలుగుననుట నిక్కువమని యెల్లరంగీకరింతురు. తెల్లనిరంగుగల భూమిని నీలవర్ణముగల నీరుండఁ గారణమేమని మఱికొందఱు పైవారిం బ్రశ్నిం

తురు. "భిన్నరుచిర్హి లోకః" అనుట ప్రసిద్ధమే కదా. ఆకుండికకు నాలుగు ప్రక్కలయందును శీతలద్రుమములు మాత్రమే యుండెను.

వేసవికాలములం దాచెంతగ్రామములయం దుండువారచ్చుటికిం బోయి పదిదినములుండి స్నానము మూఁడు వేళలఁ జేయుచు నావృక్షముల క్రింద వంటచేసికొని భుజించుచు నాయోగిని దర్శించుచు పోవుచుందురు. ఆయోగిని భగీరథదాసని యెల్లరుం బిలుతురు. ఎవరేని తమపేరేమని యడిగిన చిఱునవ్వునే సమాధానముగా నాముని చెప్పుచుండును. పలుసారులు ప్రశ్నించి యాతనినోటినుండి యొక మాటను బలికింప నెవ్వరును బ్రయత్నింపరైరి. ఆముని మితభాషణుఁడు. సర్వకాలము భగవద్ధ్యానమున నిమగ్నుఁడై యుండును. ఎప్పుడో యించుక మాటలాడును. ఆకొలఁది గడియలు సంశయముల నడుగఁదలఁచువా రుందురు కాని కాకదంతపరీక్షగా ననవసరముగాఁ బ్రశ్నించువా రెవ్వరుందురు? ఒకప్పు డెవ్వఁడైనఁ బ్రశ్నించునే నాయోగి యూరకుండును. ఎవ్వరు నాయోగికి ధనమిచ్చు నలవాటు గలిగించుకొనరైరి. అప్రతిగ్రహీతయని యాయనకుఁ బ్రఖ్యాతి కలదు. ఫలముల నిత్తుమన్న నన్నియు నావనమున నున్నవియే. కొందఱు దానకర్తలు మహాభక్తి మెఱయించుచు నాలుగుపండ్లు కోసి తెచ్చి యిచ్చుచుందురు. ఆముని వాని నెవరికే నిచ్చునుగాని తా నారగింపఁడు. తానే పోయి మధ్యాహ్నమునఁ జేయఁదగు క్రియల నొనరించిన పిదప ఫలములను గోసికొనివచ్చి భుజించును. ఇతరులకు శ్రమము గలిగింపవలయునన్న యూహయే యాయోగికి లేదని యిందువలన మనకుఁ దెలియవచ్చును

కొందఱు యోగులమనియో దాసులమనియో సన్న్యాసులమనియో మాంత్రికులమనియో పేరుపెట్టుకొనిమఠములు కట్టింతుమనియో దేవాలయముల నుద్ధరింతుమనియో వేదాంత పాఠశాలాస్థాపన మొనర్తుమనియో పరదేవీప్రీతిగా యజ్ఞము నొనరింతుమనియో కారణమును దెల్పి ద్రవ్యమును సేకరింతురు. వీరివలన జీవించువారు కొందఱుందురు. వీరికిని వారికి నేవో యాంతరంగికానుబంధము లుండును. ఆ సంబంధములు పాశములవలె వీరి కిర్వురకును మైత్రిని బంధించి యుంచును. వానికి లోనై పలుశ్రమములకు లోనై సేకరించిన యాధనముచే వారిం బోషింతురు. దానిచే స్వార్థము నశించునని వారెఱుంగరు. పామరులు వారి వేషములం జూచి భ్రమించి ధన మొసంగుదురు. ఇట్టి యాచారము లోకమునఁ బ్రసిద్ధమే కాని క్రొత్తదికాదు.

భగీరథదాసు పైవారిలోఁ జేర్పఁదగినవాఁడు కాఁడు. ప్రతిగ్రహ మెఱుంగని నియతుఁడు. అసత్యమాడని పవిత్ర వచనుఁడు. పరోపకారమే తపఃఫలమని భావించు జ్ఞాని. కావున నాతనియం దెవ్వరికిఁ గాని యీర్ష్యలేదు. విశేషించి భక్తియుండెను. సాధారణముగాఁ బ్రతిదిన మాతని కుటీరము కడఁ గ్రొత్తవా రగపడుదురు. మధ్యాహ్నముదనుక నాచెంత మాటలాడరాదని యెల్ల రెఱుంగుదురు. ఆవల నాయోగి సమాధిమానిరాఁగా ఫలాహారానంతరము వారిని దర్శింతురు. రెండు మూఁడు గడియ లాయోగి మాటలాడును. మంచి మాటలు నాలుగు తెలుపును. తమ కష్టములం దెల్పి వానిఁ దొలఁగించుకొను నుపాయమడుగ భగవంతుని నమ్ముఁడను మాటయే బదులువచ్చును. ఇంకను బ్రశ్నించినఁ బెద్దలనడుగుఁ

డనును. మఱల వదలక యడిగిన మౌనము సమాధానముగా నుండును. ఇట్టి నియమము గలవాఁడు కావున నాయోగి వర్యుని దర్శించి సంసారసాగరము నుత్తరించు నుపాయము నడుగుదురు. వారివారి యోగ్యతలకుం దగిన ట్లుపాయము తెల్పును కపట భక్తులు ప్రశ్నించినచో వారి కనుకూలముగా సమాధానము వచ్చును. కావున నింగితజ్ఞుఁడని యామహాత్ముని భావించుచుండిరి.

మధుసూదనరాజు కుమారుని దుర్నయములం దలపోసి వానిని సుశీలుంగాఁ జేయుమార్గ మరయుదమని నిశ్చయించుకొని యాభగీరథదాసుకడ కొకనాఁడు పోయెను. భార్యయుఁ గూడ నేగెను. ఉచితకాలమున దర్శించి నమస్కరించి తదనుమతిఁ గూరుచుండెను. భార్యయు నొకప్రక్కఁ గూరుచుండెను. కుశలప్రశ్నము చేయుచు నానడుమ

"అజాతమృతమూర్ఖాణాం వరమాద్యౌ న చాంతిమః,
సకృద్దుఃఖకరావాద్యావంతిమస్తు పదేపదే."

అనుశ్లోకమును జదివెను. (పుట్టనివాఁడు, పుట్టి చచ్చినవాఁడు, మూర్ఖుఁడు నను నీమూవురిలోఁ దొలియిరువు రుత్తములు. మూఁడవవాఁడు కాఁడు. ఏలయన నెపుడో యొకసారి మొదటి యిరువురు స్మృతికిఁ దగులుదురు మూఁడవవాఁడట్లుగాక ప్రతినిముసమునందును స్మృతికిందగులుచుండును.) ఆశ్లోకమును విని యించుక దేవభాషాపరిచయము కలవాఁడగుట రాజు దానియర్థ మెఱింగి మనసున వగచుచు నడుగరాదని యెఱింగియు "మహాత్మా! పుత్త్రరూప దుష్కర్మఫలము తొలంగుమార్గ ముపదేశింపుమా" యని దీనాననుండై ప్రార్థించెను.

అదేమి కాలమాహాత్మ్యమో కాని దాసు సుస్మితముఖుండై "రాజా! చింతింపకుము. నీకొడుకు దుడుకుదనము తొలంగును. క్రమముగా మతిమంతుఁడై వంశకర్త యగును. కాని యాతని నాకడకుఁ దోడితెచ్చి విడిపించి నీవరుగుము." అని పలుకఁగనే యా మధుసూదనరాజు పరమానందవార్ధితరంగముల నోల లాడుచు నిది నాయదృష్టమే యనుకొనుచు "మహాత్మా! నన్ను ధన్యుని జేసితిరి. నాకులము పావనమయ్యెను. నానోములపంట యా యొక్కఁడే. ఆతఁడు దుర్వినీతుఁ డగుటంజేసి వెతలం గుడుచుచుంటిని. తమ యమోఘవాక్కు నన్నుద్ధరించెను." అని మ్రొక్కి సెలవంది కనకవల్లికిం బోయెను.

మధుసూదనరా జిల్లుచేరఁగనే యెల్లరు వచ్చి యా తొలిదినమున సాగిన పాఠశాలోపన్యాసమును దెలిపిరి. దాన నాతనిచిత్తము వ్యాకులమయ్యెను. నిశ్చేష్టుఁడై కొంత సేపుండెను. విచారసాగరమున మునింగిన ట్లాతని మోము తెల్లుచుండెను. కొంతసేపు మాటాడఁజాలకయుండి యోగి వర్యుని మాట తలంపునకు రాఁగాఁ గొంతమందిని దిటవు పాదుకొల్పి కొడుకుదుర్ణయముల నడిగి తెలిసికొని యెట్లో యోపికఁబూనుఁడు. వానిని మంచిమార్గమునకుఁ ద్రిప్పువారు కలరు. నాపైఁగల విశ్వాసమున నిపుడోర్చియుండుఁడని యెన్ని యోభంగులఁ బ్రార్థించి వారిని సాగనంపెను.

ఇంతలో నొక బేహారి యరుదెంచి మధుసూదనరాజు గారూ! మీకొడుకు మాకడఁ గొన్ని సరకులం దీసికొని కొన్ని నెలలాయె. సొమ్మియ్యక యదిగోయిదిగో యని కాలముఁ ద్రోయుచున్నవాఁడని లెక్కలఁజూపెను. పరిమళవస్తు వ్రాత మాదినమునకు వృద్ధితో మూఁడువందలుపైఁ బందొమ్మిది

రజత ముద్రికలని తేలెను. ప్రతిసారియు సంతకము చేసియే యుండుట నందన్యాయమేమియు సాగలేదని యెఱింగి లేని సంతోషమును దెచ్చుకొని రేపు వచ్చి సొమ్మిత్తును అని మెల్లగా వారిని సాగనంపెను. ఈవిషయమును భార్య కెఱింగించుచుండ నింకొక వర్తకుఁడే తెంచి ఫలాహార వస్తువులం దీసికొన్న పద్దులం జూపెను. ప్రతిదినము పది రూప్యములకుఁ దక్కువగాకయుండ నవి యుండెను. మిత్రులతో వచ్చి పుచ్చుకొన్నయట్లు వారు తెల్పిరి. ఆమొత్తము సుంత తక్కువగా నేడు వందలపై ముప్పదియాఱు రజత ముద్రికలుగ నుండెను. అచ్చెరువందుచుండఁగా నొకరివెంట నొకరు వచ్చి కొన్ని యప్పులను దెల్పిరి. ఆనాఁటికి వారు తెలిపిన ప్రకారము రెండువేలు నాలుగువందలు డెబ్బది యెనిమిది రూప్యములు ఋణముతేలెను. ఇంత ధనమగువఱకు నాకేల తెలుపరైతిరని ప్రశ్నించిన యారాజునకు మీకుమారుఁ డని మూరాడక యిచ్చితిమను బదులు వచ్చెను. ఇఁక మాటాడరాదని త్వరగాఁ బంపుదునని చెప్పి వారిని సాగనంపి సాధ్వితో నీవిషయము తెల్పి యోగిమాటలు తప్పనూఱటఁ జెందఁదగు విషయమే లేదని నిశ్చయించుకొనియుండెను.

మఱికొంత సేపటికా శ్రోవన సీతారామరాజు పోవుచుండెను. పాఠశాలనుండి వచ్చుచు నింటికేగుచున్నయట్లగ పడియెను. ఆవఱకెన్నండు నాతనింబిలిచి మాటలాడినవాఁడు కాఁడు. కావున నించుక సంశయించుచు విధిలేక లేచి వచ్చి నాయనా! సీతారామరాజా! అని పిలిచెను. ఆపిలుపు చెవులఁ బడిన తోడనే నిలువంబడి నమస్కారముచేసి మెల్లగా వచ్చి

నిలువంబడియెను. ఆతని వినయము మనస్సున కెంతయో యానందమును గల్గింప రమ్మని కూరుచుండుమని పలికి యిరువురును గూరుచుండి కుశలప్రశ్నము కాఁగా వత్సా! నా కుమారుని వృత్తాంతమును సాంతముగా నెఱిఁగింపుము. ఇంచుకంతయు దాఁచిపెట్టకు మనఁగా నాబాలుఁడు తానెఱింగినదంతయుఁ దెలిపెను. భార్యయు వినుచుండ దాన నించుక శ్రమము తనకుఁ దగ్గెనని యూహించుచు విని ముక్కుపై వ్రేలిడుకొని చేయునది యేమని యోజింపసాగెను. సీతారామరాజు సెలవంది తనయింటికిఁ బోయెను.

ఆ బాలుని యడఁకువ, మాటలపొంకము, సమయోచితముగా మాటలాడు నేర్పు మధుసూదనరాజు మనస్సును గరఁగింపఁ జాలెను. ఒక్కొక్కటియు నుత్తముని జేయఁజాలును. అన్నియుఁ గుదిరినఁ జెప్పవలసిన దేమను కొనుచుఁ దనకొడుకుం దలంచుకొని యతని యవినీతిం దలంచుకొని చింతాసాగరనిమగ్నుఁ డయ్యెను. సాధ్వీమణి యనందగు నిందిరాంబ "నాథా! విచారించిన లాభము లేదు. భగీరథదాసుగారినుడు లెప్పుడును వ్యర్థములు కావు గదా! మనపిల్లవాని నెట్లో యింటికిం బిలిపించుకొని బుద్ధిచెప్పి కారణాంతరమున నాయోగికడకుఁ బిలుచుకొని పోవుదము. ఆమహనీయుని దర్శనమున నవినీతియెల్ల నశింప వినీతుఁ డగును. ఊరక విచారమునకు మీమనస్సునఁ జోటీయకుఁడు. పెద్దలమాటలు వృథగావు." అని మృదుమధురోక్తుల హితముఁ గర్తవ్యమును దెలుపఁగా సంతసించి "ప్రేయసీ! అనుకూలవతియగు కళత్రము పూర్వపుణ్యముననే లభించును.

చ. 'జనకునిబూజలంగడుఁ బ్రసన్నునిజేయునతండుపుత్త్రుఁడే
వనితమెలంగు భర్తృవశవర్తినియై యది సత్కళత్రమే
జనుఁడువిపత్తిసౌఖ్యసదృశక్రియుఁడాతఁడు మిత్త్రుఁడీత్రయం
బునుజగతిఁ లభించుఁగడుఁబుణ్యముఁ జేసినయట్టివారికిఁ.'

అన విందుము గదా. నీమాటలచే నూఱట నొందఁగల్గితిని. మనమిఁక సుతుని బిలిపించుకొను ప్రయత్నము చేయవలయును. నాకొక్కటి తోఁచుచున్నది. ఇప్పటిస్థితిని బట్టిచూడఁగా వాఁడు దేశాంతరమునకుం బాఱిపోవునని తోఁచెడు. ఋణము లిచ్చినవారు నాకడకరుదెంచి యడిగిరన్న వార్త వాఁడు వినియుండును. తనదుర్నయమునఁ బాఠశాలలోని బాలురు తిరుగుపాటొనర్చుట, యది తుదకుఁ దన యవినీతిచే సాగినట్లు స్పష్టమగుట, బాలురెల్లరు తనమాటలకు లోఁబడకుండుట, సీతారామవర్మ తననీతి మహిమమున బాలుర దుశ్చేష్టలం దొలఁగించుటయు, మహాసభలోఁ దనప్రవృత్తి నెల్లరు ఖండించుటయు, నుపాధ్యాయులుకూడ సీతారామరాజుగుణములఁ బొగడుటయు మనకుమాపన కీవఱకే తెలిసియుండును. కావునఁ దన ప్రయత్నములు విఫలములగుటయేగాక తోడి బాలురు తనతోఁ జెలిమిచేయ నీయకొనక యుండుటయు నెఱింగి యుపాయాంతరము లేక పాఱిపోవుననియే తోఁచుచున్నది. కావున మన మీతరుణమున జాగుచేయుట పాడిగాదు. కుముదవల్లికింబోయి వానినెట్లయినంగనుంగొని పిలుచుకొని రావలయును. ఈకార్యమున నాకంటె నీకే యెక్కుడు శక్తికలదు. నన్నుంజూచి వాఁడించుక జంకును. తల్లివిగాన నీకడ వానికిఁ జనువు మెండు. కాఁబట్టి నీవిప్పుడే పోయి పిలుచుకొని రావలయును. ఎన్నఁడు పరగృహముల కరుగ నెఱుఁగని

నిన్నుఁ బరగ్రామమునకే పంపఁజూచుచున్నాఁడను. అనివార్య కార్యమగుట చేఁదప్పినపిదప మనకు భరింపరాని దుఃఖము లభించుట యను నీరెండుకార్యములం దలంచుకొని మన మించుక త్వరపడవలసియున్నది. కుముదవల్లిలో నామిత్రులు పెక్కండ్రు గలరు. నిడుదవోలు రామరాజు మనయింటికి వచ్చుచుండువాఁడు కదా. ఆతనిభార్య నీయందు విశేషించి ప్రీతిగౌరవములు గలదనుటయు నీవెఱుంగుదువు కాదే? వారి యింటి కిప్పుడే పొమ్ము. ఆతఁడు వెదకి యెందున్నను సూర్య నారాయణను బిలుచుకొని వచ్చును. నీదగ్గరకు రాఁగా నెట్లో మంచిమాటలు చెప్పి పిలుచుకొని రమ్ము. ఎంతప్రొద్దు పోయి నను రావలయును. అంతదనుక మేలుకొనియుందును. నిద్ర పట్టుకాలమా యిది ? కుపుత్త్రుఁడు పూర్వదుష్కర్మఫలము. మనమిరువురము తొలిజన్మమున నేదుష్కర్మమును సమాన ముగా నొనరించితిమో. దానిఫలమును సమానముగా ననుభ వించుచున్నాము. విధిగతి దప్పించుకొన మనకు శక్యమా? సాధ్వీ! తడవు చేయవలదు. నాభోజనవిషయము తలంచు కొనకుము. ఈవిచారమునఁ గడుపునిండియే యున్నది. ఆహా రమునకుఁ జోటు కానరాదు. పూర్వదుష్కృతమును సంతోష మున ననుభవింపవలయునని పెద్దలు విశేషించి భగీరథ దాసుగారును జెప్పఁగా విన్నాఁడను కావునఁ బ్రాణేశ్వరీ! తడవుచేయక పయనము చేయు” మనఁగా నాయమయు భర్త కెదురాడ నోడి కార్యభంగిం దలంచుకొని సమ్మతించెను.

సూర్యనారాయణరాజు పాఠశాలయందు సాగిన మహాసభ నాలకించి విద్యార్థులు తన కుతంత్రమును దెలిసి

కొని తనపొత్తు మానుకొనఁ బట్టుదల కలిగియున్న వారనియు నెఱింగి సోమరులు కొందఱు తన్నుఁ బరివేష్టించి యుండఁగా నొకయింటిలో నెందో కూరుచుండి రహస్యాలోచనము చేయుచుండెను. కొంద ఱందు మరల విద్యార్థులకు బోధించి తమవంకఁ ద్రిప్పుకొందుమనిరి. కొందఱు "దీన నేమగును? మీతండ్రి ధనమీయకున్న నీ పాఠశాలయే నిలిచిపోవును. నీవింటికిఁ బోయి యన్నము మాని పట్టుపట్టిన మీ తండ్రి ధనమీయ మానును. ఉపాధ్యాయులందఱు వచ్చి తుదకు నిన్నే ప్రార్థింతురు. మనమపుడు మరల సభ చేసి సీతారామరాజే దీనికిఁ గారణమని తీర్మానము ప్రతిపాదింపఁ జేయవలయునని చెప్పుదము. విధిలేక వారంగీకరింతురు. గ్రామమునఁ గల పెద్దలనందఱం బిలిపించి వారియెదుట నా తీర్మానమును జేయింతము. అప్పుడెల్లరు నిన్నే శ్లాఘింతురు. బాలురకు నెల్లరకు నీయందే గౌరవము హెచ్చును. నీసాయము లేక యీపాఠశాల సాగదని తోఁచును. మన యిచ్ఛాను సారము ప్రవర్తింతము. ఉపాధ్యాయులెల్లరు నిన్నును, నీమూలమున మమ్మును జూచి భయంపడుదురు. పరీక్షలలో మనలఁ గృతార్థులనుగాఁ జేయుదురు. మనదే రాజ్యమగును." అనియు బోధింప నాలకించుచు నవ్వుచు నడుమనడుమఁ గాచపాత్రస్థ లవణబాష్పోదకమును (Soda Water) ద్రాగుచుఁ బత్ర ధూమమును (Beedies and Cigarettes) బీల్చుచుఁ దానే మహారాజు ననియుఁ దనవలననే యెల్లరు బ్రదుకుచున్న వారనియు ననుకొనుచు నవ్వుచు వార్తాపత్రికలఁ జూచుచున్న ట్లభినయించుచు సంతోషించుచుండెను.

నిజుదవోలు రామరాజు కొందఱు బాలురను బిలుచుకొని యందందు వెదకుచుండెను. సుమారు పదునొకండు గంటలవేళ యయ్యెను. దుర్వృత్తులెల్లరు రామరాజువెంట నుండిరి. ఆయాయి గృహములంజూచుచుఁ బోవుచుండిరి. ఒక్కదుండగీఁడు వచ్చి యాయింటిలో నున్నవారిని సంజ్ఞ చేసెను. అదియొక చిన్నవీథి. అందుండువారు ప్రాయికముగా వేశ్యలు. వారివంటివారు మఱికొందఱు నందుందురు. సాధారణముగాఁ బెద్దమనుష్యులు మంచిబాలురు నాసందు వీథికిం బోవరు. ఎవరైనఁ బోవుచుండఁగాఁ జూచిన వారు నవ్వుదురు. క్రొత్తవారెవ్వరైనఁ బోవుచున్న ట్లగపడిన బతిమాలి యది పోఁదగిన వీథి కాదందురు. ఆ వీథియందే యొక వేశ్యాగృహమున సూర్యనారాయణరాజు నతని మిత్రులు నాలోచించుచుండిరి. ఆగృహము చూపఁగనే రామరాజేవగించుచు విధిలేక యాయింటిముందు నిలువంబడి యందుఁ జొరఁదగినవారల బతిమాలి పెడత్రోవను బాఱిపోవక యుండఁజూచుచుండ మఱికొందఱి నియమించి వారి నుబ్బించుచు బతిమాలుచు నుండెను. నాలుగువైపులం గొందఱు కనిపెట్టియుండిరి. ఒకరిద్దఱు పిలువఁదగినయట్టు లాయింటివారిని బిలిచిరి. వారెఱింగినవారి కంఠధ్వనియే కావున వచ్చి తలుపు తెఱచిరి. లోనికింబోయిరి. ఒక యీల వినవచ్చెను. ఎల్లరు పరుగెత్తిరి. ఏమిదియని రామరాజు విభ్రాంతుఁడై చూచుచుండ గోడదాఁటిపోవుచున్న సూర్యనారాయణవర్మను బట్టితెచ్చితిమని బాలురాతని నప్పగించిరి. ఆతని మోమునఁ గ్రోధము నాట్యమాడుచుండెను. పరిమళములు వెదఁజల్లుచు దుస్తులు సొగసుగ నుండెను. "ఏల నన్నుఁ దెచ్చితిరి? చూడుఁడు నా

దెబ్బ మిమ్మేమి చేసెదనో" యనుమాట లాతని నోటినుండి వెడలుచుండెను. మఱి నాలుగు నిముసములకు మఱికొందఱిఁ బట్టుకొని వచ్చి రామరాజు మ్రోల నిలిపిరి వారే యాదుష్ట బాలుని మిత్రులని పాఠకులూహింపఁగలరు. వారిం జూడఁగనే రామరాజు పట్టరాని కోపమున నేమో యనఁబోయి సమయము కాదని యాగ్రహమాపుకొని లేనిశాంతము నభినయించుచు వెడనవ్వు కనఁబడఁజేయుచుఁ దడబడుమాటలతో "నాయనా! మీతల్లిగారు వచ్చియున్నారు. తండ్రిగారికి మనోవైకల్యము గలిగెనఁట. సంసారము చాల చిక్కులలోఁ బడినదఁట. ఋణములిమ్మని యుత్తమర్ణులు (creditors) అడుగుచున్నారఁట. మీతల్లిగారు విచారసాగరమున మునింగి దిక్కుదోఁపమి వచ్చియున్నారు. ఇల్లు వెడలి యాతల్లి నీకై వచ్చినది. నాయనా! తల్లిదండ్రుల దుఃఖముల పాలుచేయుట న్యాయమా ?" అనునంతలో నొకశకటమునడుమనుండి "సూర్యనారాయణా! నాయనా! రారా" యనుమాటలు విన వచ్చెను. తల్లియేయని ధ్వనివలన నెఱింగి గబగబ పరుగెత్తెను. బండినుండి చేయిపట్టుకొన్న జాడ కనఁబడెను. నలువురను గావలి యుండఁ బంచి రామరాజు తాను నాబండివెంటఁ బోయెను. ఆశకటము కనకవల్లికేసి పోవసాగెను. రాత్రి మూఁడవజాము గడువకముందే కనకవల్లి కెల్లరును జేరఁగల్గిరి. అంతలో నాయిందిరాంబ యేమి బోధించెనో తెలియదుకాని సూర్యనారాయణవర్మ మనస్సు మాఱిపోయెను. తనయపరాధముల నంగీకరించి క్షమింపుఁడని కోరఁదగు స్థితియందుండెను.

"అమంత్రమక్షరం నాస్తి నాస్తి మూలమనౌషధమ్,

అయోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః."
అన్నసూక్తి యేనాఁడును వ్యర్థము కాదు కదా!

పాఠకమహాశయులారా! లోకమున మంత్రముగాఁ గి యక్షర మొక్కటియు లేదు. మందునకుఁ బనికిరాని మూలము (వేఱు) లేదు. కుజనుఁ డనఁబడువాఁడును లేఁడు. కూర్చువాఁ డొకఁడే దొరకఁడు అనఁగా భావమేమి? ఏయేయక్షరములు కలిపిన మంత్రమగునో, యేయే వేఱును గూర్చిన మందగునో ఎట్లెట్లు సంస్కరించిన బాలుఁడు బుద్ధిమంతుఁడగునో యెఱింగి సంస్కరించువాఁ డొక్కఁడుండినఁ జాలును. ఈశుక్రనీతి వాక్యము నూహింపుఁడు. బాలురెల్లరు తొలుత నవివేకులు గనే యుందురు. చక్కని సంస్కారములచేత నెల్లరు బుద్ధిమంతులగుదురు. ఈనియమ మేకాలముననుయ వ్యర్థముకాదు. ఇపుడు దుష్ప్రవర్తకులగు బాలురుండుట సంస్కర్తలు లేకయే గాని వేఱుకాదు. ఎంతటి దుష్టబాలుఁడైనను జక్కనిసంస్కర్త యొదవెనేని బాగుపడునని శుక్రనీతి తెలుపుచున్నది. ఎంత ప్రయత్నించినను జక్కనిప్రవర్తనము లభింపనివాఁ డొకానొకఁ డుండవచ్చును. సామాన్యశాస్త్రమున కొకానొక చోటఁ బ్రవృత్తి లేకపోవచ్చును. కాని సాధారణముగా నది వ్యర్థము కాదనవచ్చును. సంస్కర్త పరిశుద్ధచిత్తుఁ డయ్యె నేని శిష్యునిబుద్ధిని మరల్పఁజాలుననుట సిద్ధాంతము. శ్రీరామకృష్ణపరమహంసయుఁ దచ్ఛిష్యుఁడగు వివేకానందస్వామియు నిందులకుదాహరణము. తొలుత వివేకానందస్వామి యేస్థితియం దుండెనో పరమహంస యాతని నెట్లు మార్చెనో యెల్లరకుఁ దెలిసినవిషయము. నాస్తికుఁడుగా నున్న యావిద్యార్థిని

గొలఁది నెలలలో శ్రీరామకృష్ణ పరమహంస యాస్తికశిరో మణినిగా నొనరింపఁజాలెను. గురువు చిత్తము పరమపావనము. కరుణారససాంద్రము. కావునఁ బ్రేమరశ్ములు శిష్యుని బంధించి తచ్చిత్తకల్మషమును సద్బోధామృతధారలఁ గడిగి వినిర్మలముగా నొనర్చెను. విగతకల్మషుఁడై యాతఁడు జ్ఞానవంతుఁ డయ్యెను. కావున బోధకులు తమరు పరిశుద్ధాంతఃకరణులై బోధ్యులను బరిశుద్ధస్వాంతులఁ జేయఁజాలుదురు. కేవల వాగాడంబరమున ఫలము లభింపదనుట స్పష్టము. ఇఁకఁ గథకు మరలుదము.

ఇందిరాంబ హస్తస్పర్శముననే కుమారుఁడు సూర్య నారాయణుఁడు సుమతి యయ్యెను. శకటాంతర్భాగమున నాపూజ్యమతి యేమి బోధించెనో యెవ్వరెఱుంగరు. విశేషించి బోధించునంత యవకాశ మామెకు నుండదనియు నామె సద్భావమే యాతని మరలించెననియు మన మూహింప వచ్చును. ఇన్నిదినము లేల యామె సద్భావము మరలింపఁ జాలకపోయెనని యడుగవచ్చును. ఇంతకుముం దామెకుఁ దనయుని దుర్నీతి తెలియదనియు నిన్న మొన్ననే యామె చెవుల నది సోఁకెననియు నాయమ తనసద్భావ మాసమయ మునఁ గనఁబఱచెననియు మన మూహింపవచ్చును. దీనికే మనశ్శక్తి యనియుఁ గొందఱు నామకరణము చేయుదురు. ఆపేరు న్యాయ్యమేయని మనము నిశ్చయింపవచ్చును. మన శ్శక్తి లేక యేపనియు సాగదని భగవంతుఁడు గీతాశాస్త్రము నందుఁ దెలిపి యున్నాఁడు. చంచలమగు మనస్సును గ్రమ క్రమముగా స్వాధీనము చేసికొనినచో నది లోకత్రయమును స్వాధీనమున నుంచఁగలదు. యోగశక్తియన్న నదియే.

కనకపల్లిఁ జేరఁగనే సూర్యనారాయణ పూర్వరీతిగా నింటఁ బ్రవేశించి తండ్రికి నమస్కరించెను. అంతియగాక పాదములను గరములం బట్టుకొని విడువక యించుక సేపుండెను. ఎల్లరూరక చూచుచుండిరి. కన్నీటిధారలచేఁ గాళ్లు దడియుచున్నట్లు తెలిసికొని మధుసూదనరాజు దయావశీకృతహృదయుఁడు గావున జాలి తన్నుఁ బురికొల్పఁ గొడుకు లేవనెత్తి చూచునంతలో నాతని హృదయము జలధారలఁ దోఁగుచుండెను. దానింజూచిన వారలకే మనస్సు కరఁగెనన నింకఁ దండ్రి మాట యిటఁ జెప్పఁనేటికి? కొడుకున కంటెఁ దండ్రియుఁ దండ్రికంటెఁ గొడుకు నేడువసాగిరి. వీరిరువురను మించి తల్లి విలాపము. దానినిమించి వచ్చినవారి రోదనము చెలరేఁగ నాగృహము దుఃఖమయ మయ్యెను. కొలఁది నిమేషములకుఁ దండ్రియుఁ గుమారుఁడు వచ్చినవారును దల్లియుఁ గ్రమముగా నేడ్పుడిగిరి. మధుసూదనరాజు కొడుకుఁ జెంతఁ గూరుచుండఁ బెట్టుకొని "నాయనా! వగవకుము. గ్రహచార బలమున నీకిట్టి యపకీర్తి చేకూరినది. ఇంకనైన సత్సహవాసమున మంచి పేరు సంపాదింపుము. నన్నును దల్లి నపకీర్తినొందఁజేయకుము. నలుగురు బంధువులలోఁ దలయెత్తుకొని తిరుగఁజేసి పెద్దల పేరునకు హాని నావలన రాకయుండఁ బ్రవర్తింపుము. నీవుద్ధరింతువని కొండంత యాసతో నున్నాము. మానోముల పంటగా నీవు జనించితివి. ఇంతదనుక మాకు మనశ్చింత కలిగినదే లేదు. రెండుమూఁడు దినములనుండి యించుకించుకగా నది యంకురించి నేఁటి యుదయమునుండి వర్ధిల్లినది. జరగిన దానిని స్మరింపవలదు. ద్రవ్యవ్యయమునకుఁ జింతింపకుము. ఋణములకు భయంపడకుము. భగవంతుఁ డించుక యన్నవస్త్ర

ముల నొసంగినాఁడు. ఋణములఁ దీర్చెదను పాఠశాలలో బంధువర్గములో నీపేరు సంతోషము నొదవించునట్లు వర్తింపు" మని యనేక భంగుల బోధించి ప్రొద్దుపోయినందునఁ గొడుకును శయనింపుమని పంపెను. రామరాజుంజూచి "పుత్త్ర భిక్షము పెట్టిన మహాత్ముఁడవు. నీయుపకారమునకుఁ బ్రత్యుపకారము చేయఁజాలను. నావలన శ్రమం బయ్యెను. మన్నింపు"మని వేఁడుకొన నాతండును దగినట్లు మాటలాడి యాతని యనుమతినందే శయనించెను. ఎల్లరు శయనించిరి. మఱునాఁటియుదయమున వారు పయనము చేయఁగా ఫలాహార పూర్వకముగా సాగనంపి వెంటవచ్చినబాలురకుఁ బసదనం బిచ్చి పంపెను.

---

## నాల్గవ ప్రకరణము.

రామచంద్రరాజు సుంత యవకాశము దొరకినపుడెల్ల భగీరథదాసుగారిని దర్శించుచుండువాఁడు. మధుసూదనరాజు దర్శించివచ్చిన మఱుదినమే వారి దర్శింపఁబోయి యుండెను. దాసు ఈరాజును జూచినఁ బరమానందభరితుఁ డగుచుండువాఁడు. మాటలాడునంతసేపు సత్పుత్త్రభాగ్యము నీకు లభించెనని పలుకుచుండుట యాయోగి కలవాటు. ఆనాఁడు రాజుతో మాటలాడుచు "నేను గోరినపుడు నీతనయుని నా కడనుండునట్లు చేయఁగలవా?" అని ప్రశ్నించెను. పట్టరాని

యానందమున నంతకంటె భాగ్యము గలదా యని బదు లిచ్చెను. "ఇపుడు వలదు. సమయము వచ్చును. ఇచ్చుటం గొన్ని శ్రమము లనుభవింపవలసి వచ్చును. కాని యాయను భవము సుఖములకు మార్గము చూపు" నని దాసు పలికెను. మఱికొన్ని మాటలు జరగిన పిమ్మట రాజు సెలవుగైకొని యింటికిం బోయెను. ఆసువార్త సుశీలకుం దెలుప నామె నామాటను గొడుకుచెవిలోం బడవైచెను. సీతారామరాజు సుసమయ మద్దాని కెపుడువచ్చునో యనియు నేల యాముని యిట్లాజ్ఞాపించెనో యనియుం దలపోయుచుండెను. ముందుగా యోగి తెలిపినం బిండివంటలు సిద్ధముచేసి యుంతుననియు వాని సాయమునం జిరంజీవి వారము దినములు మునికడ భోజనమునకై బాధపడక యుండంగలండనియు భర్తకుం దెలుపుచుండెను. మునికడ నుండువారలకు బాధలుండునా యని భర్త పలికెను. అది తోంపకయే యీ యాలోచనము చేయుచున్నానని సుశీల తెలిపెను వార్త యెపుడు వచ్చునో యని వారిరువురును వేచియుండిరి.

కనకవల్లిలో నాల్గుదినములు సూర్యనారాయణవర్మ యుం డెను. తండ్రి కుముదవల్లిలోని వర్తకులు లోనగువారికిం గొడుకీయవలసిన ద్రవ్యమంతయు నిచ్చివేసెను. ఆయా దిన ములలోందానుదీసికొన్న వస్తువులపేరులు వారు తెల్పుచున్నప్పు డెల్ల నావర్మగుండెలు వడంకుచుండెను. తనదుశ్చర్య యిట్టిదని యాతనికిం జక్కంగాం దోంచెను. ప్రతిక్షణమునందును మార్పునొందుచు నాతని మంచిమార్గమునకు జేర్చుచుండెను. తన ద్రవ్యమెంత యీరీతిగా దుర్వ్యయమయ్యెనో స్పష్టమగు చుండెను. ఇన్ని చింతలు నాతని బాగుచేయం జాలునవియే.

పుటము పెట్టినఁగాని బంగరు వన్నెమించి వెలుంగదు. పాపము! వర్మ తనతండ్రి ఋణములుతీర్చుచుండునపు డాతనిమోమునం దోఁచు వైవర్ణ్యము శ్రమంపడి యార్జించినవిత్తము దుర్వ్యయమునకైన ఋణమున కిచ్చునపుడు చేతులు వడఁకుటయుఁ గాంచి తన తెలివితక్కువను బలుసారులు నిందించుకొనియెను. ఇఁకముం దిట్టి చెడుకార్యములను జేయనని యొట్టుపెట్టుకొనియెను. ఉత్తమర్ణులు సుంతయుఁ గొఱంతగాకయుండఁ దమ విత్తముం బట్టుకొనిపోయిరి. ఇఁకఁ గుముదవల్లిలో ఋణము లేదని స్పష్టముకాఁగా నామధుసూదనరాజానాఁడు తలయంటుకొని స్నానము చేసెను. వేలకువేలుగా నిట్లప్పుతీర్చినవా రెవ్వరు లేరని యెల్లరును జెప్పుకొనసాగిరి. నాఁడు కడుపునిండ భుజించి కంటినిండ నిద్రపోయెను.

వారముదినములిట్లు కాలముగడువఁగాఁ గుమారుఁడడఁకువ గలిగియున్నవాఁడనియుఁ దనయవివేకచర్యలఁ దానెఱింగి లజ్జించుచున్నవాఁడనియుఁ దండ్రి యెఱింగెను. తల్లిగాని తండ్రిగాని యొక్కమాటయైన నాతని ననక యథాపూర్వ వాత్సల్యమున నాతనిని రక్షించుచుండిరి. కుముదవల్లి మిత్రులు వచ్చిరి గాని సూర్యనారాయణవర్మ వారితో నంతప్రియముగా మాటలాడలేదు. విధిలేక మాటలాడినట్లు నటించెను. వారును హతాశులై పోయిరి. ఈతనిచే ధనము విశేషించి వ్యయము చేయించిన నుపహారమిత్రులు పత్రికామూలమునను గూఢచారులమూలమునను వార్తలంబంపిరిగాని వర్మ తన యజ్ఞానచర్యలకు లజ్జించుచుండుటంబట్టి బదులిడకయు నిచ్చిన ననిష్టమును సూచించుచు వారిపొందు తనకక్కఱలేదని స్పష్టపఱచెను. ఆతఁడు మదిలో సీతారామరాజుతో మైత్రి సంపా

దింపఁ గోరుచుండును. కాని నలుగురిలోఁ దలయెత్తుకొని "తగుదు నమ్మా" యని తిరుగ జంకుచుండెను. తండ్రి యావిధ మించుక యోచించెను. దానిందీర్చినఁగాని బాగుపడఁడని నిశ్చయించి యొకనాఁడు కుమారునిం బిలిచి "నాయనా! లజ్జ వదలుము. గతమునకు వగవరాదు. సాధుసంగతి సంపాదించుకొనుము. అల్పులతోటి మైత్రి మంచిదిగాదు.

ఉ. 'నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁబడి మణిత్వముగాంచు సమంచితప్రభా
పౌరుషవృత్తులిట్లధమమధ్యమునుత్తముఁగొల్చువారికిన్.'

అని పెద్దలు వచింతురు. సాధు సంగతి సర్వథా సర్వదా శుభదాయకము.

తే. 'సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు నరులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవిస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థసాధనంబు.'

అన్నవాక్యమును జక్కఁగా మది నిలిపి ప్రవర్తింపుము. దాన నన్నిగౌరవంతలు తీరును. మర్యాద కలుగును. సాధుసంగతిని మించినదేదియు వృద్ధినొందు మార్గము లేదు." అనియు నెన్నియో విధముల బోధించెను. తుదకు మీ యానతిమైఁ బ్రవర్తింతునని శపథము చేసెను. దానికలరి పత్నితో నాలోచించి యొక శుభదినము నిర్ణయించి యోగివర్యుని చెంతకరుగఁ దలంచుచుండెను. కొడుకును దండ్రి యానతి మీఱరాదను విశ్వాసముగలవాఁడుగా నపుడున్నందునఁ దానును

వారివెంటఁ బోవ నంగీకరించెను. ఆ యంగీకారము తల్లి దండ్రుల కెంతయో సంతోష మొసంగఁజాలెను.

భగీరథదాసు దర్శింపఁబోయినవా రొకరు వచ్చి రామచంద్రరాజుతో సపుత్రుఁడవగు నిన్ను దాసుగారు చూడఁగోరుచున్నవారని తెలిపెను. ఏనుఁగునెక్కినంత సంతోషము కలుగఁగాఁ గొడుకున కావార్త నెఱిఁగించెను. పాఠశాలలో నాదినములు సెలవు దినములుగా దైవికముగా నేర్పడుట నిదియే సుసమయమని యతఁడు తెలిపెను. భార్యయుఁ బయనమయ్యెను. ఆదినమే సాయంకాలమునకు వారు మూపురా యాశ్రమమును జేరిరి. ఛాయావృక్షముల క్రిందనే యుండవలయునుగాని నిలువ వేఱొక తావులేదు. ఆవృక్షములు వేలకొలంది మానవులకుఁ జోటీయఁ జాలినవి. కాన నందుండిరి. ఆరాత్రి దాసును దర్శించిరి. చిఱునవ్వుతో సుసమయమునకే వచ్చితిరనెను. తమసెలవునకై వేచియుంటిని. ఆభాగ్యము లభించెను. కృతార్థుఁడనైతినని రాజు పలికెను. రేపు తెలియఁగలదని దాసు బదులుపలికి తనపనికై పోయెను.

మఱుదిన ముదయమున రాజు కాల్యకృత్యములఁ దీర్చికొని వంటకుఁదగిన వస్తువ్రాతము తెచ్చియుండుట వానిభార్య కిచ్చుచుండఁగా మధుసూదనరాజు సకుటుంబముగా వచ్చెను. పరస్పర కుశలప్రశ్నములు సాగెను. వారు నొకవృక్షముక్రింద నుండిరి. మధ్యాహ్నము కాఁగానే భుజింపక దాసు దర్శనమునకై వేచియుండిరి. యుక్త సమయమున దాసు లేచి మాటలాడఁదగు చోటఁ గూరుచుండెను. ఎల్లరు నచ్చుటికింబోయి యథార్హముగా దర్శించిరి. వారిని గూరుచుండ నియోగించి "వీరి కుపదేశింపఁ బూనితిని. ఈయిరువురు

కుమారులు కొలఁది దినము లిందుండురుగాక. వారివిషయమై యేవిచారమును బెట్టుకొనక మీ రరుగుఁడు. నేను వారిని జూచుకొను చుందును. ధర్మోపదేశము చేయనెంచితిని." అనఁగానే వారి యానందమునకు మేరలేదయ్యెను. భోజనానంతరము పనివినియెద మనిరి. దాసు నవ్వుచుఁ బిండివంటలుచేసి యిచ్చి పోవునంత యవసరము లేదనియెను. సుశీలకు రామచంద్రరాజునకు నచ్చెరువు తోఁచెను. అతీంద్రియ జ్ఞాననిధి యన్న భావము వారికి దృఢపడియెను. వారొండొరుల మొగములు చూచుకొనసాగిరి. మరల శిశువుల రక్షించు భారమాపరమేశ్వరునిదిగాని మనది గాదని నమ్మి పొండని దాసుగారనిరి. చిత్తమని బదులుపలికి సెలవంది యెల్లరుఁ దమనివాసముల కరిగిరి. మధుసూదనరా జామాటలయర్థ మెఱుంగక ప్రస్తావింపఁగా రామచంద్రరాజు తనభార్య ప్రయత్నించిన విషయ మెఱిఁగించి యిది మాకుఁ దప్ప నెవరికిఁ దెలియదనుకొంటిమి. దివ్యదృష్టిగల దాసుగా రెఱింగిరని తెల్ప నాతఁ డచ్చెరువంది సాయంకాలమునకు ముందే ఫలాహారముచేసి దాసుగారు కూరుచున్న తఱింబోయి కుమారుల నప్పగించి యారెండు కుటుంబములవారును గనకవల్లికిం బోయిరి.

దాసు సీతారామ సూర్యనారాయణవర్మలం జూచి, "కుమారులారా! మీరియాశ్రమమున నుండుఁడు. వృక్షమూలముల నుండకుఁడు. మధ్యాహ్నము దాఁటఁగా సాయంకాలముదనుక నేను మీతో మాటలాడుదు. రాత్రి నే నిందే శయనింతును. మీరు నాచెంత శయనింపుఁడు. దుష్టమృగసర్పబాధ లిందుఁ గలుగవు. సాయంసమయమున నే నల్లకుండికకు స్నానార్థము వెళ్లుదును. నాతోడ రండు. మీ కాఁకలి కాక

యుండ నాహార మొసంగుదును. మీరిరువురు నేకోదరులవలె
నుండవలయుఁజుఁడీ! ఎవరిమనస్సునఁగాని యీర్ష్యయుండరాదు.
దానిని వదలుఁడు. మీజీవితము నయ్యది పాడుచేయును. దాని
నెట్లో శ్రమంపడి వదలుదురేని కృతకృత్యులరగుదురు. ఈ
వనమున మధ్యాహ్నముదనుకఁ దిరుగుచుండుఁడు. ఎన్నియో
వింతలు కనంబడును. లోకజ్ఞానము విశేషించి కలుఁగును. అం
దందు సర్పములు కనంబడును. క్రూరస్వభావములు గలవియని
సందేహించి భీతి నొందకుఁడు. అవి కానరాఁగా నిలువంబడి
యుండుఁడు. అవి మీజోలికి రావు. వానిపని నవి చూచు
కొనుచుండును. అట్లే పక్షులుకూడ నుండును. చక్కఁగాఁ జూచు
చుండుఁడు. దాన మీ కపూర్వమగు చక్కనిజ్ఞాన ముదయిం
చును. జంతువులను జూచి యూరకపోరాదు. వాని ప్రవృత్తి
యెట్టిదని విచారింపవలయును. మనస్సు భగవంతుఁ డొసంగిన
దిందులకే. ఈ విచారమున కందు విశాలస్థలము గలదు.
ఆలోచించుకొలఁది ననేక విషయములు తెలియుచునుండును.
ఒకరు బోధించిన నిట్టి జ్ఞానము కలుగదు. పుస్తకపాఠజ్ఞా
నము ముఖ్యమేకాని దానితోఁ దృప్తినొందినఁ జాలదు.
లోకమున నేజంతు వేపని చేయుచున్నది? దానింగాంచి మనము
నేర్చుకొనఁదగు విషయ మేది? అని తర్కించుకొన వల
యును. కొంతకాలమీలాగు చేయఁగా నొకయద్భుతశక్తి మన
స్సునఁ బొడసూపును. ఆపిదప నేపుస్తకమున నెంతరహస్య
విషయ మున్నను నది ప్రాఁతదిగాఁ దోఁచును. కారణమేమి?
లోకజ్ఞాన మన్నింటికంటె నతిశయమగుటయే. ఆకారణముననే
మహాత్ములు సకలశాస్త్రపారంగతు లైరి. అన్ని శాస్త్రములు
చదువఁదగునంత యాయుస్సు మానవులకు లేదు. లోకజ్ఞానము

కలవారికి శాస్త్రము లన్నియుం జదివిన నెట్టి విజ్ఞాన ముద యించునో దానిని మించిన జ్ఞానముండునని మీరెఱుంగ వలయు ఈవనమున మిమ్ము బాధించెడి జంతువులేవియు లేవు. మీరు వేఱొక్కదానిని గని యది క్రూరస్వభావము గలదని భావింతురేని యది మిమ్మునట్లే భావించి తనకపకారము కలుగఁగలదన్న బుద్ధిచే నది కలుగకుండఁజేసి కొనుటకై మిమ్ము బాధించును. అట్లుగాక మీరు దానింగాంచి సద్భావముగల వారగుదురేని యదియు సద్భావముకలదియై మిమ్ముం బ్రేమిం చును. పరస్పర సుహృద్భావమే సుఖహేతువగును. పరస్పర జిఘాంసయే దుఃఖహేతు వగును. ఈవిషయమును జక్కఁగా భావింపుఁడు. ఇట్టివనేక విషయములను మీరిందుఁ గనుఁ గొందురు. నాయీవాక్కులను దలపోయుచుఁ దిరుగుఁడు. మధ్యాహ్నము పిదప నాతో మాటలాడుచుండుఁడు. ఇదియే మీరిందుఁ జేయఁదగుపని.

శ్లో. 'యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం,
అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి.'

(న్యాయము ననుసరించి ప్రవర్తించువారికిఁ బశులును సాయ పడును. అన్యాయపథమునఁ దిరుగువారిని సోదరుఁడు కూడ వదలిపెట్టును) అన విందురు కదా! ఈనీతినే పలుమాఱులు సంస్మరింపుఁడు. ఎట్లు ప్రవర్తింపవలయునో స్పష్టమగును. సాయంసమయమిది. అనుష్ఠానమునకుం బోయెదను. మీరును రండు. అనుష్ఠానానంతరము మిమ్ముల మాటలాడింతును. అంతదనుక మౌనముగ నుండుఁడు. మౌనము సర్వార్థ సాధకము. ప్రతిమానవుఁడు నొక్కింతసేపు మౌనముగ నుండ నభ్యసించునేని యాయుస్సును గొంత వృద్ధిచేసికొన్నవాఁ

డగును. సందియము లేదు. మీరు చాలసేపు మౌనముద్ర ధరింపఁజాలరేని నాయనుష్ఠానమునకు భంగముగాకయుండ నించుకగా మాటలాడుకొనుఁడు." అని పలికి కుండికకుఁ బోవఁ బయనమయ్యెను.

శిష్యు లిరువురును దాసుగారి వెంటఁ బయనమైరి. సీతారామరాజు కమండలువు పట్టుకొనిపోయెను. సూర్య నారాయణరాజు భస్మముగల బరణిం బట్టుకొని నడిచెను. కుండికను సమీపించిరి. దానికి దక్షిణభాగమున నీరంధ్రముగ వృక్షము లుండెను. సూర్యుఁ డపరాద్రికిం జేరఁబోవ నుండెను. దాసు "రాజకుమారులారా! మీ రిందుండుఁడు! నేనిదె వచ్చెద" నని కమండలువు తీసికొని యావృక్షములు గల చోటికిం బోయెను. క్రొత్తవారి కావృక్షవాటిక భయముఁ గొలుపుచుండును. ప్రవేశింప నవకాశము లేనియట్లు వృక్షము లుండెను. నడుమ నడుమ వెదురుపొదలు గలవు దూరమునుండి వినువారికి నందు నుదయించుధ్వని శ్రీకృష్ణుని వేణుగానమును స్మరణమునకుం దెచ్చుచుండును. అందు దాసు ప్రవేశించి కొలఁది నిమేషముల కరుదెంచెను. "రా కొమరులారా! దోసిలించి యీపాలం ద్రావుఁడు. ఆరోగ దృఢగాత్రులగుదు" రని యిరువురకుం బోయఁగా వారు త్రావిరి. సూర్యనారాయణ వర్మ యింకఁ గొంచెముండినఁ బోయుఁ డనెను. దాసు నవ్వి యింకఁ జాలును అని పలికెను.

అయ్యది వృక్షరసమని పాఠకమహాశయు లూహింపఁ గలరని నమ్మెదను. అయ్యది పాలను పేరఁ బిలువంబడును. దానిం ద్రావినంతనె వారికి మూఁడు త్రేఁపులు వచ్చెను. ఆఁకలి మాయమయ్యెను. తిక్తకషాయము (Coffee) త్రాగి

నశ్లేయయ్యెను. ఏదేనొకపని చేయవలయునన్న యూహ కల్గెను. అంతియగాక మనస్సున నపూర్వమగు నుత్సాహము కల్గెను. అది యానందముగాఁ బరిణమించెను. వారికే యచ్చెరువుగాఁ దోఁచెను. ఏమిది యని యూహింపసాగిరి. దాసుగారి నడుగ నుంకించిరి. ఏమనుదురో యన్న ద్వాపరము వారి నడుగకుండ నొక్కెను. వారు గుటకలు మ్రింగసాగిరి. దాసె ఱింగెను. సంశయమును దీర్పనెంచెను. "బాలకులారా! యివి వృక్షక్షీరములు. స్వాదుతరములు. వీని మహిమ మపారము. ఎఱుంగం గోరితిరి. సంశయించితిరే ఏల? గురువు మ్రోల సంశయంపడుట పొరపాటు. శంకలం దీర్చుకొనుటకే కదా జనులు గురువుల నాశ్రయింతురు. వారి శంకలఁ దీర్పఁజాలరేని వారికి గురునామము భారమే యన వలయును. ఈ శంకలం దీర్పుఁడని గురువుల నడుగుట శిష్యులకు విధి. ఇఁక వినుఁడు. ఈ క్షీరము లేవృక్షమునఁ గలుగునని మాత్రము ప్రశ్నింపరాదు. అవి యించుక రహస్యమే. ఎల్లరకుఁ దెలుపఁదగదు. సంసారమునఁ బ్రవర్తించు వారి కిది వచింపరాదు. శరీరధారణమునకుఁ బెక్కు పదార్థములు వారికిం గలవు. మావంటి వారలకే యిట్టివి పనికి వచ్చును. వీని విషయము దెల్పిన వీని నిర్మూలింతురు. ఆశా విరహితులకే యివి పనికివచ్చును. ఈ క్షీరముల వలని లాభములం దెలిపెద. ఆలకింపుఁడు. వీనిం ద్రావిన క్షుత్పిపాస లడంగును. ఆహారాంతరము కావలయునన్న యాశ యుదయింపదు. మఱియు నిద్ర బాధింపదు. ఇంతియ కాదు. మనస్సు నిర్మలముగానుండును. మేధశ్శక్తి వృద్ధియగును. నేత్రాదిరోగములు రావు. వచ్చియున్న నవి తమంతట తొలంగును. దూర

దృష్టి గరుత్మంతునకుం బోలెఁ గలుగును. గాఢాంధకారమున దృష్టి వ్యాపించును. ఇవియే మీకుఁ దెలుపఁదగినవి. మీరిం దెంతకాలముండిన నాహారబాధ యుండదు. ఫలములనల వాటుచొప్పునఁ దినుఁడు. తినకయున్నను బాధయొదవదు. కాని యలవాటును మీరు వదలరాదు." అని తెలిపి స్నానము చేసి విభూతి ధరించి కమండలువునిండ నుదకములంగొని యందించుకతడవు కాల్యకృత్యములం దీర్చి యాశ్రమమునకుఁ బయనమయ్యెను. వారింగూడి యాయిరువురు వచ్చిరి. ఆశ్రమముజేరి యనుష్ఠానమునకా దాసు కూరుచుండెను. వీరును వారు మున్ను చెప్పియున్న చొప్పున నాచోటునఁ గూరుచుండి మౌనముద్రాధారులైరి. ఆ దినమున వారికిఁ గల్గిన యానంద మననుభూతపూర్వమే. దానికదియే సాటియనందగు ప్రపంచ మంతయుఁ జుట్టిరావలయునని యొకసారియు, హిమాలయ మును జక్కఁగాఁ జూచి రావలయునని యింకొక్కమాఱును, వియద్గమన మేల శక్యము కాదు? అని యింకొక్కపర్యా యము, అపూర్వవిషయములం బరిశీలింతమని మఱియొక తూరియు నిట్లే సంకల్పము లొకదానివెంట నొకటిగాఁ దోఁచుచుండెను. వారందుల కేమి హేతువోయని యూహింపఁ జాలరైరి.

తొలియామము దాఁటనున్న తఱి దాసుగారు లేచి వచ్చిరి. వీరి మౌనముద్రాధారణమున కానందించెను. నాలుగు పండ్లొసంగి యారగింపుఁ డనియెను. ఆఁకలియన నెట్టిదో తోఁపలేదనిరి. నవ్వుచు భక్షింపుఁడన వానిం బరమ భక్తిమీఱ గైకొని నమలిరి. కూరుచుండి కొంతసేపిష్టాలాప ములఁ బ్రొద్దుపుచ్చిరి. నేఁడు సుఖనిద్ర చేయుఁడు. రేపుద

యము కాల్యకృత్యములం దీర్చి తిరిగిరండు. మధ్యాహ్నము పిదప మాటలాడుదునని వారిం బరుండఁజేసి తానును వారి కించుక దూరమున శయనించెను.

తెల్లవాఱుజామున నే దాసు స్నానమున కరిగివచ్చి యథాపూర్వముగఁ గూరుచుండెను. కుమారు లిరువురును మేల్కాంచి సరస్సున స్నానముచేసి కాల్యకృత్యములం దీర్చుకొని మునియానతిమెయి వనమున కరిగిరి. శీతలవాతపోతములు పూవులతావుల వెదఁజల్లుచు వారిపై బొలయుచుండెను. ఆగాలి సోఁకినంతనే హాయిహాయి యనుకొనుచు వారు ముందునకుఁ బోవసాగిరి. లతామండపములు తీర్చినట్లుండెను. ఫలవృక్షములు ఫలభారమున వంగియుండెను. సర్వర్తుఫలము లందుండునని వారికిందోఁచెను. ఒక్కొక్కచోట లతావిశేషము లచ్చెరువు గొలుపుచుండెను. పూవులు రాలి గాలికెగురుచుండఁ జూడ వేడుకగానుండెను. ఫలములనుండి మధుధారలు స్రవించుచుండెను. శుకములు పలుకుచుఁ జెవులపండువు సేయుచుండెను. దూరమునుండి మయూరనినాదములు వినవచ్చుచుండెను. ఆయడవి యెంతదూరమున్నదో యెఱుంగఁదరమా యని వారికిందోఁచెను. వానరములు వింతవింత రంగులుగలవి యచ్చోట వారికిఁ గానవచ్చెను. శాఖలనుండి యవి నిక్కినిక్కి చూచుచుండెను. కాని యిసుమంతయు భయమును గల్గింపవయ్యెను. వారొక్కచోట నిలువంబడి చూచుచున్న నెన్నియోమాసములు గడుపవచ్చునని యూహించిరి. కాలము పుచ్చుట కింతకంటె నుత్తమస్థానము వేఱొకటి యుండునా యని వారు నిశ్చయించిరి. ఒండొరుల కందలి విచిత్రములం దెలుపుకొనుచు వారు పోవుచుండిరి. వేఱొకచో విచిత్ర

మార్జారము లగపడెను. అడవియందు బిడాలము లుండునా యని సూర్యనారాయణవర్మ ప్రశ్నించెను. వనముల నేవేవి యుండునో మన మెఱుంగము. కూపకూర్మములముగా మన మున్నవారమని సీతారామరాజు బదులుచెప్పెను.

కొంత ముందు నడచిరి. అందొక్క పొదదాపునఁ బారావత మిథునము లుండెను. అవి యొండొంటితో ముచ్చట లాడుచుండెను. గడ్డి గింజలను వెదకికొని భక్షించు చుండెను. పరస్పరము కలహింపక యవి యెంతో ముచ్చ టగాఁ దిరుగుచుఁ గింజల వెదకికొనుచు నోరవేసికొనుచు గుంపుగానుండి తిరుగుచు నర్తనము నభ్యసించున ట్లుండెను. సఖా! చూచితివి కదా? ఒక కార్యమునందుఁ బెక్కండ్రు ప్రవర్తించుచోఁ గలహింపక యితరుల వంచింపక స్వార్థపరులు గాక ముచ్చటగఁ దమ ప్రయత్నము చేయుచు ఫలసిద్ధి దైవముపై నునిచియున్న నెంతయు సుఖము గలుగునని యీ కలరవముల చర్య బోధించుచున్నది. నిన్న గురువుగా రీ విషయమునే నొక్కి చెప్పిరి. మఱచితివా యేమి? అనఁగా సూర్యనారాయణవర్మ మఱచిపోలేదు. నిక్కముగ నీవన్న యట్లే వీనిచర్య తెలుపుచున్నదనెను. ఇంచుక తడవందుఁ బుచ్చి మఱినాలుగడుగులు ముందు జరగి యొక్కచో దృష్టి సాగించిరి. మహావృక్షమున గొప్ప కొమ్మపైనఁ గూరుచున్న శాఖామృగములు కనఁబడెను. అందొక వానరము పాదము నుండి రక్తము వెడలుచుండెను. ఒక్కకోఁతి యేవో యాకులు తెచ్చెను. వేఱొక్క మర్కటము వాని నందుకొని తునుకలుగాఁ జేసెను. ఇంతలో వేఱొక్కకపితల్లజ మల్లన నారక్త

మును దుడిచెను. పూర్వవానరమాయాకులతునుకలు మెల్లగా నందుఁ జక్కఁగా నుంచెను. ఇంక నొక్కకీశము లేఁతతీఁగలు తెచ్చి దాని చేతి కొసఁగెను. మఱియు నొక్క వనౌకము పెద్దయాకును జీల్చి యిచ్చెను. ఆయాకుతునుకలపై నా పెద్ద యాకులోని సగమును బెట్టి యాలేఁదీఁగచే జాగ్రత్తగాఁ గట్టెను ఆ కొమ్మచెంతనే వేఱొక కొమ్మయుండెను. దాని మీఁదనుండి యొక క్రోఁతి దాని నిమురసాగెను. వేఱొకండు పెద్దయాకులు గల కొమ్మలతో విసరసాగెను. కొన్ని చూచు చుండెను. ఆకులు తునుకలుచేసిన యా కపివర్యమే యొక పండు తెచ్చి దానినోటి కందిచ్చెను. దాని నమలి యది హాయిగా శయనించెను. ఈ చర్యయంతయుఁ దిలకించుచున్న సీతారామరాజు "మిత్రమా! చూచితివా?

తే. 'అఘమువలన మరల్చు హితార్థకలితుఁ
జేయు గుహ్యంబు డాఁచుఁ బోషించు గుణము
విడువఁ డాపన్ను లేవడివేళ నిచ్చు
మిత్రుఁ డీలక్షణంబుల మెలఁగుచుండు.'

అన్నసూక్తి యెఱుంగుదువు కదా? ఈ లక్షణము లివ్వాని యందుఁ గానంబడియెడు. మానవులు కూడ నిట్లుపకారపరా యణు లైనచో నెట్లుండునో! మృగజాతిలోఁ జేరినవయ్యుఁ బరోపకారకరణమున మానవులకంటె నూరురెట్లు మిన్నలని చెప్పవచ్చును గదా! మనము కూడ వీనింజూచి యిట్లు పరోప కారముచేయ నేర్చుకొనవలయును జుమీ." అనఁగాఁ జెలి కాఁడు నట్లేని భాగ్యమే యనవలయు ననియె.

వారిరువు రచ్చోటు గడచి వేఱొండు భాగమునకుం బోయిరి. అందు విశేషించి ఫలవృక్షము లుండెను. చూడ

రెండుకన్నులు చాలవని వారికిం దోఁచెను. వాని నెంతయో వేడ్కతో నెగఁ జూచుచుండిరి. ఆఫలవృక్షముల కొమ్మల తుదలఁగూరుచుండి చిలుకలు ముద్దులొలుకుపలుకులఁగాలము గడపుచుండెను. అందుఁ గొన్ని బూడిదరంగుగలవి. మఱికొన్ని పచ్చనివర్ణము కలవి. ఇంకఁగొన్ని యైదువిధములగు కాంతులు గలవి. మఱియుఁ గొన్ని రెండువర్ణములే కలవి. వానింజూచి నిలువంబడి "నెయ్యుఁడా! వానింజూచితివే? ఎంత బాగున్నవి! నేత్రముల కింతకంటె నానందము కలుగు నవకాశము దొరకునా? మంచిపక్షులుగదా యివి. మాంసాహారమును గొనవు. ఫలములను బీజములను భక్షించును. ఎవ్వరికిని హానిచేయు నవికావు. చూడుమా అల్లది మగచిలుక కాఁబోలును. తాఁదెచ్చిన యాహారమును బ్రీతిమై చెంతనున్న ప్రియురాలి కిడుచున్నది. ఓహో! దానిప్రక్కనున్నవి పిల్లలు కాఁబోలు. నోరుతెఱచి యాహారమును బెట్టుమని బతిమాలుచున్నట్లున్నవి. అల్లదె కంటివే. మగఁడు తననోటిలోఁ బెట్టిన యాహారమును బిల్లలనోటిలో నాయాఁడుపిట్ట పెట్టుచున్నది. ఒక్కసారి యెన్నిపిల్లలు నోరుతెఱచుచున్నవో చూచితివా? చూచితివా ఇంతలో మగపిట్ట యెక్కడికో పోవుచున్నది. పాపము! కలహించియే కాఁబోలును? అల్లదిగో మరల నామగపిట్ట వచ్చుచున్నది. ఏటికో? త్వరగాఁ జూడుము. తాఁదెచ్చిన యాహారమును మరలఁ బత్నినోటిలో నిడుచున్నది. చక్కఁగాఁ జూడుము. అది యెంత ప్రీతితో నందుకొనుచున్నదో. నోరు నోటితోఁ గలుపుచున్నది. పక్షములగాలిచే భర్తకుపచారము చేయుచున్నది పిల్లలు చుట్టు నున్నవి. చూడఁజూడ వేడుకగా నున్నది. ఔరా! ఆర్యకుటుంబము లిట్లు పరస్పర సద్భావము

గలిగియున్న నెంత బాగుండును? జాయాహితము పతియు, పతిహితమును బత్నియుఁ గోరుచుఁ బిల్లలను బ్రీతితోఁ బోషించుచు నున్నఁగాని యీలోకమున సుఖములేదని యీ కుటుంబచర్య మనకుఁ దెలుపుచున్నది. మిత్రవర్యా! పక్షి జాతిలో భార్యాభర్తృన్యాయము సువిహితము సుస్థిరమునై యుండునని పెద్దలు పలుకుదురు. మగపిట్ట యొక యాఁడు పిట్టను బ్రేమించునఁట. అదియు నట్లే. మరల వేఱొకదాని నీ రెండును బ్రేమింపవఁట. ఏమి దాంపత్యము! ఈయాచారమే మానవులలో వ్యాపించిన నెంతబాగుగా నుండును? భార్యను గాక వేఱొకతెం బ్రేమించు పురుషుఁడు, భర్తనుగాక వేఱొక పురుషునివలచు నారియు నుండుట వినుచున్నాము కదా! ఎంత నీచము! శాస్త్రములన్నియు మానవులనుద్ధరించుటకే పుట్టినవి. ఇంతటి విజ్ఞానము కలిగించునవి యుండియు నిందేదియు లేని పక్షిజాతికంటె మానవజాతి దురాచారములచే నీచజాతి యనందగదా? వేదములు స్మృతులు శాస్త్రములు పురాణేతి హాసములు లోనగునవి యన్నియు మానవులదురాచారములు మార్పఁజాలక యున్నవికదా. ఇంతకంటె విచిత్రమేది కలదు? దీనింబట్టి చదువు సత్ప్రవర్తనము నలవడఁ జేయఁజాలదని తేలుచుండలేదా. ఇఁకఁ గర్మమునకే స్వతంత్రత గలదని తేలె డిని. మనమీ పక్షిదంపతులంగాంచి యొక జన్మమున నొక్క తుకనే ప్రేమింపవలయును. నిష్కపటప్రేమము భార్యయందు భర్తకుఁ గలదేని యామెయుఁ బతియందే బద్ధానురాగయై యుండునని స్పష్టమయ్యెడు. నీభావమేమి?" అనఁగా నాతఁడు "నెయ్యుఁడా! నీభావమే నాభావమని నమ్ముము. ముందు

నాకేమియు నిట్టివి దోఁపవు. నీవు తెల్పిన పిదపఁ దోఁచుచుండును." అని బదులు చెప్పెను.

అంత వారిరువురును వేఱొక ప్రదేశమునకుం బోయిరి. దాసు పలికినట్లే యొక మహాగుల్మముకడఁ దేటనీటితో నొక కుల్య ప్రవహించుచుండెను. ఆరెండింటికి నడుమ భయంకర భుజంగములు రెండు శయనించి యుండెను. ఒకదాని శిరస్సు వేఱొకదాని కంఠముపై మోపఁబడియుండెను. తొలుత సీతారామరాజది యొక శుష్కవృక్షమూల మనుకొనియెను. ఇంచుక సమీపమునకుఁ బోఁగా దానిపైనున్న మచ్చలంబట్టి కొండచిలువ లిట్లుండునని పాఠము చదివియున్నకతన నద్దానిం దెలిసికొనఁ జాలెను. తొలుత భయంపడెను గాని దాసు వాక్కులు స్మృతికిం దగులఁగా భయము మాని నిలువఁబడి చూడసాగెను. సూర్యనారాయణవర్మయు నాతనిం గూడి మది తత్తఱపడుచున్నను నిలిచి చూచుచుండెను. సీతారామరాజు "సాధూ! దాసుగారు పలికినట్లే మనలంగాంచి యివి కదలక బుసకొట్టక యట్లే యున్నవి. చూడుము. వానిమోముల దెల్లని నిలువుగీఁతలున్నవి. కొండచిలువల కిట్లుండునఁట. ఇవి యుండు తావుల ననావృష్టిదోషము పొడసూపదఁట. నీవును వినియున్నాఁడవా?" అన నతఁడౌననెను. "క్రూరభుజంగముల యందును సుగుణవిశేషము కలదని స్పష్టమయ్యెను. వానినేల దుష్టములందురో తెలియఁజాలకున్నది. ఇట్టి ప్రవాదములు మానవకల్పితములే. అన్నింటి కంటె మానవజాతి యుత్తమోత్తమ మని భావించినందున నిట్టివి కల్పింపఁబడును. ఇంకొక్కదానియందు దోషమారోపించినఁగాని తనయందు గొప్పఁదన మారోపించుకొన వలనుపడదు. ఒకప్పుడు జ్ఞానము

గల వారల కన్న నీభుజంగములు నీచములు కావచ్చును. ఆహారమునుగోరి మానవుల నివి మ్రింగవచ్చును. మానవులు నిష్కారణముగా నొరుల కపకారము చేయుదురే. వారికంటె నివి యుత్తమములు గదా. చూడుము. ఒక్కదాని వేఱొకటి స్నేహించుచున్నది. బుద్ధిలేదన్నమాట యుక్తది కదా. వానికిం దగినంత బుద్ధియున్నది. వీనినే కాఁబోలు నజగరములందురు. మహాంగములు గలిగియు జోలిమాలిన పనులకుం బోవక యివి హాయిగానున్నవి. మానవులుకూడ నున్నంతతోఁ దృప్తి నొంది మనశ్చింతలు లేక హాయిగా నుండవలయునని యీ చర్య మనకు బోధించుచున్నది." అని పలికి యాకసము కేసి దృష్టిసారించి "సఖా! సూర్యుఁడు కాలము వ్యర్థము చేయఁడు. కావున మధ్యాహ్న కాలమును దెలుపుచోటికి వచ్చినాఁడు. గుహవునానతిరి బోవుదము. వారు లేచుసమయముగానున్నది." అని సూర్యనారాయణరాజుం గూడి సీతారామరాజు దాసు గారిని దర్శింపఁబోయెను.

# ఐదవ ప్రకరణము.

కృత్యములందీర్చుకొని దాసు లేచునప్పటికి మధ్యాహ్న మయ్యెను. స్నానము చేయఁబోవుచు నందాయిరువురు లేకునికి వనముఁ జూడఁబోయియుందు రనుకొనుచుఁ బోయి కుండికలో మునింగివచ్చి యప్పటికి నర్ఘ్యములగు సూర్యో

పాసనము లోనగువానిం దీర్చుకొనివచ్చెను. కుమారులిరువురు కూరుచుండి మౌనముద్రాధారులయి యుండిరి. వారిం గాంచి సంతోషించి దగ్గరకు వచ్చెను. వారును లేచి నమస్కరించిరి. మూవురు కూరుచుండిరి. "రాజపుత్త్రులారా! వనమును జూడఁ బోయితిరా?" అని ప్రశ్నింప వారచ్చట జరగిన పరస్పర సంభాషణమును దెలిపిరి. తమరు గ్రహించిన విషయములను విన్నవించిరి. యోగి పరమానందమంది "బాలకులారా! చక్కని జ్ఞానము మీకుఁ గలుగుచున్నది. దానికిం దోడుగా నుండుటకు నాలుగుమాటలు చెప్పెదను వినుఁడు.

మీరు విద్యాభ్యాసము చేయుచున్నవారు. అది మీకే యుపకారము చేసినదో మీరెఱుంగరు. విద్య పదార్థవిజ్ఞానమునిచ్చును. అంతతో సంతృప్తినొందిన నుపయోగము లేక పోవును. ఆ విజ్ఞానము స్వానుభవమున దృఢము కావలెను. దానిచే లోకజ్ఞానము కలుగును. అద్దానిచే దుర్విషయముల యెడ నసూయయు, సద్విషయముల యెడ ననురాగము చక్కఁగాఁ గుదురును. దాన మానవుఁడు సార్థకజన్ముఁ డగును. పరమార్థ మిదిగదాయని తెలియును. ఆమీఁద దాని నొందుపద్ధతి యెట్లను తర్కమున మనస్సు పనిచేయును. ఒరులసాయమది యపేక్షింపదు. తనంతన మనస్సు పలు భంగులఁ బాటుపటుచుండును. క్రమక్రమముగాఁ బరిశుద్ధమై పరమార్థదర్శనమున సూక్ష్మతమ మగును. అట్టిమనస్సుగల వానిని గృతార్థునిజేయ భగవంతుఁడు సమ్మతించును. ఏ రూపమున వానికి మేలు చేకూర్పవలయునో యామహనీయ మూర్తి యెఱింగి యారూపమునఁ బొడసూపును. భగవంతుని యప్పటిరూపము భక్తునివాంఛ ననుసరించి యుండును. ఆ

రూపమే యాపరాత్పరునిది కాదు. ఎల్లరూపము లామహనీయ మూర్తివే యగును. మున్ను విద్యాగంధ మెఱుంగని కాళి దాసు కాళికాలయమునఁ గూరుచుండి తలుపువేసి వేచి యుండెను. ఆ మహాకాళి సంచారము పోయెననియుఁ దలుపు మూసిన రాఁజాలదనియు నప్పుడా దేవాలయమున లేదనియు నాతని యాశయము: ఆ మహామాయ లేని చోటు గలదా! అని యాతఁడెఱుంగఁడు ఏల? విద్యాగంధము లేశమే నాతనికి లేదు. ఆమె సర్వమెఱింగిన పరదేవి. వానివాంఛ నెఱింగెను. ఆదేవాలయమున భక్తులు మానసమునఁ దనను ధ్యానింపఁ జాలనివారు గాన శిలావిగ్రహముగా నారాధించుచున్న యారూపమును గనఁబడక యుండఁజేసి తానెందో సంచారము చేయఁబోయివచ్చినట్లు వచ్చెను. ఆతఁడు కాళికాదేవి భయం కరరూపిణి యని వినియుండెను. కాన నట్లే రూపము కనఁబడ ద్వారమునకడ నిల్చి యదలించి పిలిచెను. పలుకలేదు. మరల లోపలనున్నవా రెవ్వరని ప్రశ్నించెను. మనస్సులోఁ గల్పిత సాధ్వస మాతని బాధింపసాగెను. తడఁబడుచున్న మాటలతో "కాళీ విద్యనిమ్మా" అనఁబోయి "కాళీ బిద్దె" అని యడిగెను. నాలుకఁ జాఁపుమాయని యాదేవి పలికెను. ద్వారబిలమునుండి నాలుకనాతఁ డించుక చాఁపఁగల్గెను. ఆదేవి నవ్వుచు నెంత పామరుఁడుగాకున్న నిట్లుండునా యనుకొనుచు నేమో వ్రాసినట్లు నటించెను. ఆదేవి తలంచినంతనే విద్యా పారంగతుండయ్యెను. ద్వారము తనంతనే విధ్వస్తబంధన మయ్యెను. దేవి యప్పుడు శారదా రూపమున నాతనికిం దోఁచెను. ఏల? ఆతని వాంఛ విద్యపై నుండెను. శారద

వాగ్దేవి యని ప్రసిద్ధముగాన నట్లే దర్శనమిచ్చెను. తద్దర్శనమున ధన్యుండై.

శ్లో. 'మాణిక్యవీణాముపలాలయంతీం
మదాలసాం మంజులవాగ్విలాసాం,
మాహేంద్రనీలద్యుతికోమలాంగీం
మాతంగకన్యాం మనసా స్మరామి.'

అని యా జగదంబను సన్నుతించెను. బాలకులారా! కాళిక యారూపమున నేల కనఁబడెను? భక్తునివాంఛ కామరూపము దాల్చినఁగాని విశ్వాస మాతనిమదిఁ బుట్టింప నవకాశములేదు. కావున భగవంతుఁడు నాస్థితియందున్న మానవుని గృతార్థునిజేయ నేరూపముననో పొడసూపి వానికిఁ దగినజ్ఞానము నను గ్రహించును. కావున విద్యప్రథమసాధనము. అదియుఁ గొందఱకు వాదము చేయుటకు మాత్రమే యుపకరించును. మీరు తగినంత విద్యను గ్రహించితిరి. దానికిఫలముగా లోకజ్ఞానము కలిగిన మీరుత్తముల రగుదురు. మీరు నేఁటి యుదయ మాయాయితొవులఁ జూచిన విషయముల నుండి చక్కని నీతుల గ్రహింపఁజాలితిరి. దానింబట్టి మీకుఁ దగినంత విద్య యలవడెనని గ్రహించితిని. ఇఁకఁ గొన్ని విషయములు దెలుపఁదగియున్నవి. వానిందెలిపెద. సావధానులరు గండు.

మానవుఁడు వృద్ధియగుటకుఁ బ్రధానము సత్ప్రవర్తనము. అది సాధుసంగతి, సత్కథాశ్రవణము, దైవభక్తి, పుణ్యస్థలదర్శనము నను నీనాల్గురూపములుగా నుండును. ఈనాలుగింట నేది తక్కువయైనను మానవుని ధన్యుని జేయఁజాలదు.

ఈ నాలుగు మార్గముల నెవ్వఁడు చక్కఁగా సంభావించునో వాఁడే వృద్ధికి రాఁగలఁడు. నేఁడు సాధుసంగతిగూర్చి యొక్క యితిహాసమును దెలుపుదు. వినుండు.

## సాధుసంగతి.

మున్నొకక్క రాజు రాజ్యమును బాలించుచుండెను. ఆతని కొక్కముని మిత్త్రుఁడుగా నుండెను. ఏవిషయమున సందియములుండిన నామునినడిగి తెలిసికొని యారీతిఁ బ్రవర్తించువాఁడు. ప్రజ లాతనియందు ననురాగముగలిగి ప్రవర్తించువారు. కొంతకాల మిట్లు సాగఁగా నొక్కకుమారుఁ డారాజునకుఁ గలిగెను. సంస్కారములన్నియు యథావిధిగా సాగించెను. విద్యయుఁ దగినవారి నియమించి చెప్పించెను. యుక్తవయస్సు వచ్చునప్పటికి యువరాజు నొనరింపఁదగు యోగ్యతయుఁ గలిగెను ఎల్లరు సంతసించిరి. ఆమహోత్సవము సాగింప నెల్లరు నుద్యుక్తులై యుండిరి. దైవగతి విపరీతముగా నున్నపుడు మానవప్రయత్నము నిష్ఫలమగునన్న సూక్తి యెల్లరకు బోధించుటకో యన నా రాజవరేణ్యుఁడు మృతినొందెను. రాజ్యమంతయు దుఃఖమయమయ్యెను.

ప్రజలెల్లరు చక్కఁగా నాలోచించి కుమారుని బట్టభద్రు నొనరించిరి. పితృసఖుఁడగు మునియు నరుదెంచెను. మంత్రిప్రభృతుల కమ్మునిపై నీర్ష్య యుండెను. రాజు సమర్థుఁడగుటయు, ముని సర్వజ్ఞుఁడగుటయు మునిమతము ననుసరించి రాజు మెలంగుటయుఁ గారణములుగా వారి దుర్వాంఛలు ఫలింపక యుండెను. రాజపత్ని సాధుస్వభావభూషిత యగుటఁ గుమారునిం బిలిచి 'నాయనా! మునివరునానతిమెయి

మెలంగుము. ఉద్యోగులమాటలఁ జెవియొగ్గి యాలకింపకుము. వారు సర్వస్వ మపహరింప సమర్థులు. నీతండ్రి మునిమతమునే యనుసరించుటం జేసి వారియాటలు సాగకుండెను. ఇపుడు నీవు చిన్నవాఁడ వగుటం జేసి తమయిష్టానుసారము మెలంగుదురు. దుర్నీతులు బోధింతురు. దురాచారము లలవడఁజేయుదురు. ప్రజలపై నాగ్రహము కలిగింతురు. కావున వారి మాటల నాదరింపక మునివర్యు నడిగి కార్యములఁ బ్రవర్తింపు' మని వేయిభంగుల బోధించెను. కుమారుఁడును జనని వాక్కులఁ జెవియొగ్గి యాలకించి యట్లే యొనరింప బద్ధకంకణుం డయ్యెను.

మునియు సమయము వేచియుండి మిత్రపుత్త్రుఁ డన్న యనురాగమున నాతనికిం గార్యాకార్యముల తెఱం గెఱింగించుచుఁ బ్రకృతుల యెడ నెట్లు ప్రవర్తింపఁ దగునో యా మార్గముల నెల్లఁ జక్కఁగా వినిపించుచు, జనుల విషయమున నెట్టి ప్రీతిని జూపఁదగునో తెలుపుచు దండ్యుల నదండ్యుల నెట్లు కనుఁగొనవలయునో యావిధముల వక్కాణించుచు, నిరుగుపొరుగు రాజులతోడ విరోధ మేలాగు గలుగదో యాపద్ధతుల నొక్కి వక్కాణించుచు భాండాగారము వృద్ధి చేయు లక్షణమును, సేనలంగూర్చు తెన్నును, మఱియు రాజునకు వలయు ననేకనీతులను జాగ్రత్తగా మది నాటఁ జెప్పుచుఁ గొన్ని నెలలుండి యతని యనుమతి నొంది తపోవనమున కరిగెను. ముని యెపుడు పోవునా యని కాచియున్న మంత్రులు లోనగువారు చెలరేఁగిరి. ప్రజలపై నెన్నియో యపరాధముల నారోపించిరి. ధనమును గొల్లగొట్టసాగిరి. ఒకరిపై నొకరుగా వారపరాధముల నారోపింపసాగిరి. రాజుచిత్తము కలంత

నొందించిరి. విశేషించి లోకానుభవము లేనివాఁడుకాన నా రాజకుమారుఁడు వారిమాటలఁ జెవియొగ్గి యాలకింపసాగెను. క్రమముగాఁ బ్రజానురాగమును గోల్పోయెను. కోశమంతయు నశింపఁగా మానవుల బాధించి ద్రవ్యముంగొన మొదలిడెను.

ఈ యపయశస్సు నాలుగుకడల వ్యాపించెను. సామంత రాజులు మంత్రుల కుపదాన మిచ్చి కప్పములు చెల్లింప మానిరి. వారి నదిమిఁ గప్పములు గొనఁజాలమని మంత్రులు పలుక వానిజోలియే మానుకొనెను. పగవారు రాజ్యము నాక్రమింపఁ బ్రయత్నించుచుండిరి. ఈవార్తలెల్లను దపోనియతినున్న మునిమదికిం దెల్లమయ్యెను. మిత్రునియందుఁ గలవాత్సల్యంబు పెంపునఁ దపస్సుకూడ లెక్కింపక వచ్చి తన రాక రాజున కెఱిఁగింపుఁడని దౌవారికులం గోరెను. వారు గుటకలు మ్రింగుచు లోపలికిం బోయినట్లు నటించి వచ్చి యిది రాజు దర్శింప సమయముకాదని తెలిపిరి. అంతియగాక యిటనున్న యర్ధచంద్రప్రయోగము కూడ నగునని తేటపఱచిరి. దివ్యజ్ఞానసంపన్నుఁ డగుట నెల్లవిషయముల నెఱింగి మునివర్యుఁడు మరలిపోయి యొక్కయడవిలో వేచియుండి మృగయావినోదమునకై వచ్చుచున్న రాజును దర్శించెను. మృగయులు మాత్రము వెంటనుండిరి. వారాటవికులు గావున నీ మునివిషయ మెఱుంగరైరి.

మునియు 'రాజకుమారకా! నాయుపదేశమెల్ల వ్యర్థము చేసితివి. ప్రజానురాగమునకు దూరమైతివి. కోశగృహమెల్ల శూన్యమయ్యెను. సామంతరాజులు నిన్ను లెక్కింపక స్వతంత్రులైరి. పరరాజులు తమకనుబంధములగు గ్రామములఁ దమ రాజ్యమునఁ గలుపుకొనుచున్న నెఱుంగవైతివి. ఇట్టి దుర్నీతి

నీకెట్లు పట్టుపడెనో యెఱుంగఁజాలకున్నాఁడవు. అనాఁడు క్రింది యుద్యోగుల స్వభావము తెలిపితిని. వారికి లోఁబడక యుండుమా యని హెచ్చరించితిని. ఆలకించియు నానీతులను బాటింపవైతివే. ఎట్లు మర్యాదగలిగి జీవింతువు? ప్రజానురాగము మరల నెట్లు సంపాదించుకొందువు ? కోశవృద్ధి నెట్లు చేయఁగలవు? ధనహీనుఁడైన రాజును బ్రజలు తమ్ము బాధించునని చేర వెఱతురు. క్రూరదండనుఁడవగు నిన్నెవ్వారు చేరుదురు ? కొలఁది దినములలో నీవు శత్రువులకుఁ జిక్కి కారాగారమున నుండఁగలవు' అని యనేకవిధముల నాక్షేపించియు బుజ్జగించియు నీతిని దెలిపెను.

రాకొమరుఁ డమ్మాటల నూఱటంజెంది మునిపాదములపై వ్రాలి నన్నుద్ధరింపుమని వేఁడుకొనియెను. దుర్నీతుఁడనైతినని వగచెను. శత్రురాజులకుం జిక్కి యెట్లు బ్రదుకుదునని విలపించెను. పితృపాదులకన్న మిన్నయనఁదగు మీనుడులఁ బెడచెవులంబెట్టి చెడితినని లజ్జించెను. ముందేమిగతి గాఁగలదని బతిమాలెను. ఇట్లెన్నియోవిధములఁ దన పరితాపమును వెల్లడించి యెట్లో యీకష్టములఁ దప్పింపుఁడని ప్రార్థించెను. మునిమానసము మృదుతమము వెన్నవలెం గరంగునది. కావున నారాకొమరునినేత్రముల నశ్రువులు గ్రమ్మఁగనే కరుణారసము మనస్సున నిండి పైకుబికెను. వెంటనే 'వత్సా! భయంపడకుము. గతమునకు వగవకుము. దాన లాభములేదు. కర్తవ్యమును వినుము. నాకడ నొక వాయసము గలదు. అది త్రికాలజ్ఞానము కలది. దాని నీకిచ్చెద. కొనిపోయి దాని ప్రభావ మెల్లరకుం దెలిపి యుద్యోగులకుం గాపాడఁ గట్టడ చేయుము. వారెట్టితంత్రము పన్నుదురో దానిం దెలిసి

కొమ్ము. నేను మూఁడవదినము నీకడ నుండువాఁడ. ఈనడుమ జరగు విచిత్రములం గనిపెట్టియుండుము. నేను నీ కడనుండి రాజ్యతంత్రములఁ జక్కసాగించి వత్తును. నిర్భయముగా నుండుము. జనని కీ నావార్తల నెఱిఁగింపుము. నిశ్చింతముగా నుండుమని బోధింపుము.' అని పలికి యొకకాకమును బంజరముతో నిచ్చెను. దానిని సేవకుల కొసంగి తాను మరలి నగరమున కరిగి 'యీకాకము త్రికాలజ్ఞానసంపన్నము. చక్కఁగాఁ గాపాడుఁడు. ఎవ్వరేయపరాధ మొనరించిన నిది యెఱింగించును. రేపకడ నాకడకుఁ దేవలయును. ఎల్లవార్తల నిదియే యెఱింగించును.' అని యాజ్ఞాపించి మహాద్వారముననే యా పంజరము నునిచి తానంతఃపురమునకుఁ బోయెను.

మృగయులవలన ముని యెవఁడో యీకాక మొసంగుట తమ గుట్టుల నన్నింటిని దెలుపుటయు నాలకించి యుద్యోగులంద ఱీకాకమునెట్లో యీరేయి ముగించవలయు నని యాలోచించి రాజునాజ్ఞ యనుల్లంఘ్య మన్నమాట లెక్కింపక యవివేకుఁ డీతఁడు మనచేతి యాటబొమ్మయన్న యూహగలవారు కావున నాఁటి తెల్లవాఱుజామున దానిం జంపి పిల్లి చంపెనని తెలుపుఁడని ద్వారపాలకులకు బోధించి తమ యిరవుల కరిగిరి. ద్వారపాలకులు యామము వెళ్ళఁగాఁ దమరరుగుచు దానిం జంపి పోయిరి. రెండవతెగవారు వచ్చి కావలియుండిరి. వారలీవార్త నెఱుంగరు. ఉదయము రాజు కడకుంగొంపోవ సేవకులు రాఁగా నది చచ్చియున్నదని చూపి తమకీవార్త తెలియదని ద్వారపాలకులు తెల్పిరి. విచారింప సాగఁగాఁ దొలుతనున్న ద్వారపాలకుల మూలమున నా కాకమును మార్జారము పట్టుకొనఁబోవ విడిపించితిమనియు

క్షయమున మృతినొందెననియుఁ దెలియవచ్చెను. రాజున కీవార్తను దెలిపిరి.

ఇవ్విధమున నియోగుల కపటోపాయంబునఁ గాకంబు మృతంబగుట యెఱింగి యారాజకుమారుఁడు మునివచనములు సూనృతములని నిశ్చయించి వారినేమియు ననక మునిరాక కెదురు చూచుచుండెను. మునియు దానిమృతి నంతర్దృష్టి నెఱింగి మూఁడవదినము సకాలమున రాజుకడ కరుదెంచెను. నియోగుల దుర్వృత్తి నెఱుంగునుగాన రాజు సేవకుల మూలమున నామహర్షికి నవమతి సంభవించునో యని తానే సౌధోపరిభాగమునఁ గూరుచుండి యుండెను. మునికిఁ బూర్వమురీతి సన్మానము జరగెను. అంతలో రాజభటుఁడు వచ్చి ద్వారపాలకుల నదలించి యామహర్షిని దోడుకొని పోయి రాజుకడం జేర్చెను. యథావిధి మునిని గారవించి రాజు జరగిన వృత్తాంతమును దెలిపెను. రహస్యగోష్ఠి యొక యామము సాగెను. భోజనానంతరము ముని రాజజననింగాంచి యూఱడించి తనయాశయమును దెలిపి సమ్మదము నొందఁ జేసి తానందే నిలిచెను. మఱుదినమునుండి విశ్వాసపాత్రులగు నియోగులెల్ల వచ్చి తమ దుస్థితిని విన్నవించి దుఃఖించిరి. వారల నూఱడించి తన యుద్యమముం దెలుప వారందులకు సంతోషమును వెలిపుచ్చి యథాపూర్వముగాఁ దమ యుద్యోగముల నిల్చిరి. మునియనుమతిని రాజ్యపాలనము సాగుచున్నదని విన్నయంతనే సామంతరాజులు కప్పంబులం గొనితెచ్చి సమర్పించి స్వాపరాధముల నివేదించి మంత్రుల దురాలోచనముల విన్నవించిరి. క్రమక్రమముగాఁ గొన్ని నెలలకు యథాపూర్వముగా రాజ్యపరిపాలనము సాగెను.

దుర్మంత్రులం దొలఁగించి విశ్వాసపాత్రుల నప్పనికి నియో గించి తా నండగానుండి రాజునకుఁ గార్యాకార్యములను దెలుపుచు నాతని వినీతుంజేసెను. ఆమహర్షి యుపదేశించిన రీతిని బ్రవర్తించుచుఁ గోశమును వృద్ధిచేసి పగవారి నోడించి విజయస్తంభముల నాటి యజ్ఞములచే దేవతల సంతృప్తులనుగా నొనరించుచు నతిథులఁ బూజించుచుఁ బూజ్యభంగి రాజ్యమును బాలించుచుండెను. అమ్మునియుఁ గొంతకాల మందే యుండి ప్రజానురాగముగాఁ బాలించు రాజకుమారుని స్వభావమును బరీక్షించి ప్రకృతుల గుణములం బరిశీలించి యిఁకఁ బ్రమాదము వాటిల్లదని నిశ్చయించి పూర్వ దుర్మంత్రులఁ దొలఁగించి ధర్మములనెల్లఁ జెప్పఁదగువానిం దెలిపి తనకృత్యమునకుఁ దాఁబోయెను. కావున రాజ కుమారులారా! సాధుసంగతి ప్రధానముగాఁ జేయఁదగినది. అది యొదవదేని యభివృద్ధి మానవునకుఁ గలుగదు.” అని బోధించి సాయంకాల మగుచున్నందున ననుష్ఠానమునకుం బోయెను.

వర్మలిరువురును సుఖనిద్రచేసి వేఁకువ లేచి యోగివరు వెంటఁ బోయి కుండికలో స్నానము చేసి విధులం దీర్చుకొని వనదర్శనమునకుం బోయిరి. రెండవదినము వారు వెళ్లినది దక్షిణభాగమునసుండు వనమని పాఠకు లెఱుంగవలయును. తొలిదినమున యాత్ర తూర్పుభాగమును గూర్చి యనియు నెఱుంగుటొప్పు. వినోదపాత్రములగు తావులందు విశేషించి కనఁబడియెడు. కొంతదూరము పోవఁగా నందొక్క చీమల బారు కనఁబడియెను. ఆచెంత మధురఫల మొండు పరిపక్వ మగుట వృంతము మెత్తఁబడఁగాఁ గ్రిందఁబడియెను. దానిని

భక్షింప నవి పోవుచుండెను. ఎందుండి వచ్చుచుండునో యని వారు పరికించిరి. దూరమునుండి వచ్చుచున్నట్లు పోల్చిరిగాని విశేషముగా నందుఁ బొదలుండుటంజేసి స్థలనిర్దేశము చేయ వలనుపడదయ్యెను. ఆఫలమునఁ గొంత భాగము సేకరించి యాశకలముల నోటంబట్టుకొని వచ్చునవి యొకచాలుగాను, దాని సేకరింపఁబోవునవి వేఱొక చాలుగ నుండెను. వచ్చుచుండునవి పోవుచుండువానిని స్పృశించిగాని పోవకుండెను. ఆపద్ధతిం జూడఁగాఁ దమ యాహారమును వానికింజూపి మీరును బోయి తెచ్చుకొనుండని తెలుపుచున్నయట్లు తోఁచెను. సూర్యనారాయణరాజు "సఖా! చూడుము. పేరాసలేక యొక పదార్థము నెల్లర కుపయోగింపవలయు నన్నయూహ వీని కున్నయట్లు తోఁచెడిని. మానవులు కూడ నిట్లే దొరకిన దానిని దమరే సర్వ మపహరించి యితరులకు దొరకకయుండఁ జేయవలయు ననుదురుద్దేశము మాని సోదరభావము నవలంబించిన నెంత బాగుండును? ఎంత సుఖముగా జీవింప నవకాశము కల్గును? లోకమునఁ బేరాశయను మహావ్యాధి పెక్కండ్రను వదలక బాధించుచున్నది. సద్భావమను మహౌషధము సేవించిన నది తొలఁగును. అది తొలంగినఁగాని మానవులు సుఖముగా జీవింప నవకాశము దొరకదు. సర్వవిధానర్థములా యాశారోగముననే కలుగుచున్నవి. నీవును జూడుము. ఆచీమల ప్రవృత్తి యెంత బాగున్నది? తృప్తి వానికిం గలదని తెలియుటలేదా? పరస్పరసద్భావము గలిగినచో లోకమునఁ జోరాదులుండఁ జోటు దొరకునా! దుఃఖమున కవకాశము కలదా? మన మీనాఁడీచీమలం జూచి యీ విషయమును గ్రహించితిమి. ఈవఱకీనీతి పుస్తకపఠనమున నెఱింగినదియే.

కాని కన్నులారఁ గాంచినందున నయ్యది మది నాటినది. ఇందు లకే యోగి వనముఁ జూడఁ బొమ్మనెను" అని పలికి యిరువు రందుఁ గొంతసేపుండి వానిరాకపోకలం దిలకించి యంతటి యవ్యయానందము నవి యనుభవింపఁ దృప్తి సద్భావము నను రెండును గారణములుగాని వేఱొండు కారణము లేదని యెఱింగి యవ్వలం బోయిరి.

ఒక్కచో జలధారలు జలజల పాఱుచుండెను. దాని చెంత నొకవృక్షము ఫలించి యుండెను. ఆ ఫలముల పేరేమో వారెఱుంగరైరి. మున్నెన్నఁడు వారు వానిం జూచికాని వినిగాని యెఱుంగరు. క్రొత్తవి. పరికించి యట్టె చూచుచు నిలువంబడిరి. ఆకులు కనఁబడకుండ ఫలములే యుండెను. ఒక్కొక్క ఫలము పసుపురంగు, ఎరుపురంగు కలిగియుండెను. అంత పెద్దవి కావు. గుండ్రముగా నవి యుండెను. మన మెఱిం గిన ఫలజాతిలో దేనిం బోలియుండునో తెలిసికొందమని వారూహించి నిలిచిరి. ఎంతసేపు నిలువంబడి బ్రహ్మాలోక పర్యంత మాలోచించినను దోఁపదయ్యెను. వానిని భక్షించు పక్షులు గూడ నందుఁ గానరాదయ్యెను. అట్లే చూచుచుం డఁగా నందొక నకులము పచ్చనివన్నెగల పామును బట్టు కొనఁ బొంచియుండెను. అవి యుండుకొమ్మ లించుకదూరమున నుండెను. ఎగిరి పట్టుకొన్న నాకొమ్మ లేఁతదిగానఁ బడుదు నేమోయని జంకు నకులమున కున్నయట్లు తోఁచెను. ఇంతలో నెందుండియో యొకకొంగ వచ్చి యాకొమ్మపైన వ్రాలెను. దాని భారమున కాకొమ్మ వంగెను. ఆపాము క్రిందఁ బడెను. కూడ నకులము దుమికెను. కలుగులోనికిం బోయి పాము తనప్రాణమును గాపాడుకొనెను. ముంగి తనవాంఛ

నెఱవేఱమికిం జింతిల్లి గుటకలు మ్రింగుచు నింకొక్కతావు నకుం బోయెను. ఆ విధమంతయుం గాంచుచున్న సీతారామ రాజు 'మిత్రవర్యా! చూచితివికదా? నకులము కపటయోగి వలెఁ దదేకాసక్తిమై నుండెను. మనము మానవులమై యుండియుఁ దానిని రక్షింపఁబూనమైతిమి. ఇదొకవిలాసముగాఁ జూచుచుంటిమి. ప్రాణములం దీయఁబూనిన దాని నదలింప మనకు శక్తిచాలదా? దాని ప్రాణములపై నెంత యాఁపామున కాశకలదో మన మెఱుంగఁజాలమా? అట్టులయ్యు మనకుఁ గల దురాచారమును బట్టి యనఁగా సర్పము దుష్టజంతువు. దానిం జంపక విడువరాదు. అన్న యలవాటు ననుసరించి దానిం గావఁ బూనమైతిమి. ఇంతకంటె దుస్స్వభావము కలదా? శక్తిమంతులయ్యుఁ బ్రాణరక్షణము చేయరేని మానవత్వము పశుత్వమునకంటె నీచము కాదా? భగవంతుఁడే యాకొంగను బ్రోత్సహించి యందు వాలునట్లు చేసెను. ఏక్షణముననో దానినోటఁ బడవలసిన జంతువు భగవంతునిదయచేతఁ బ్రాణములఁ గాపాడుకొనఁగల్గెను. మనకన్న నా క్రౌంచ ముత్తమోత్తమము కదా. తెలిసియో తెలియకయో మన మెఱుంగము కాని దానిమూలమున దాని ప్రాణములు నిలిచినవి. లోకమునఁ బ్రాణదానమునకన్న నుత్తమధర్మము వేఱొకండు కానరాదు. దానిని శక్తులమయ్యు నిర్వహింపక పశుతుల్యులమైతిమి. మిత్రమా! మన మిఁకమీఁద బ్రదికినంతదనుకఁ బరులకు నాపత్కాలమునఁ దోడ్పడఁ బ్రతిన సేయుదము. అంతకంటె మనము చేయఁదగిన సత్కార్యము లే"దనెను. సూర్యనారాయణరాజు నంగీకరించెను. ఇరువురును బరమేశ్వరా! అని నమస్కరించి, "దేవాదిదేవా! ప్రాణాపాయ

సమయమున మే మితరులకుఁ దోడ్పడి యా పుణ్యమును సంపాదింపఁగల్గున ట్లనుగ్రహింపు"మని ప్రార్థించిరి. అ త్తరుణముననే యెందుండియో గరుత్మంతుని నోటినుండి కృష్ణాయను శబ్దము వెలువడెను. అది శుభశకునముగా వారు భావించిరి.

మధ్యాహ్నము కాఁగా వా రాశ్రమమునకుం బోయిరి. మునియు లేచు సమయముగ నది యుండెను. ఇంచుకసేపటి కా యోగి లేచివచ్చి వారింగూడి పోయి మాధ్యాహ్నిక క్రియలు నిర్వర్తించి ఫలములం దెచ్చుకొని వారును దానును భుజించి కూరుచుండి యిట్లు పలికెను. కుమారులారా! నేఁటి వనయాత్రలో మీరేమి నేర్చుకొంటిరని వారివలన నా వార్తం దెలిసికొని పరమానందమునంది, "యుత్తమోత్తమ న్యాయము నెఱింగితిరి. ఇద్దానిని మించినధర్మము లేదు. సర్వోత్తమధర్మ మిదియే. తపోవ్రతదానాదిరూపమగు ధర్మమున నిదియొకఁడే యగ్రస్థానమును వహింపఁదగినది. పరమసంతోషమైనది. ఇఁక ధర్మోపదేశము చేసెదను. అవహితులరగుఁడు.

## సత్కథాశ్రవణము.

బాలకులారా! సాధుసంగతిని గుఱించి నిన్న ముచ్చటించితిని. నేఁడు సత్కథాశ్రవణమును గూర్చి మాటలాడుదును మానవుఁ డుత్తమస్థితికి రావలెనన్నఁ దాను జదువుకొన్నం జాలదు. వినికియుఁ గావలెను. అద్దాని మూలమున శ్రోత్రేంద్రియము పవిత్రమగును. దానిమూలమునఁ జిత్తము పావనతం గాంచును. దుర్విషయముల వినినకొలఁదిని శ్రవణేంద్రియము మలినమగును. అంతియగాక చిత్తమున మాలిన్యము నునుచును. దానిచేఁ గలుగునూహాలు మలినములే

యగును. ఆయూహాలు ప్రవర్తనమును బాడుచేయును. ఆయది భక్తిని నశింపఁజేయును. మానవుఁడు తిర్యగ్యోనులం బుట్టఁజాలును. కావున సత్కథాశ్రవణము ధర్మస్వరూప మున నొక భాగము. కావున దాని నెఱింగింతును. సాధు సంగతి యెంత ముఖ్యమో యిదియు నంత ముఖ్యమని భావిం పుఁడు. శ్రద్ధాయుక్తులరై

'శ్రుత్వా గుణాన్ భువనసుందర శృణ్వతాం తే
నిర్విశ్య కర్ణవివరైర్హరతోఽంగతాపమ్.' శ్రీభాగవతము.
'ఏనీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు
తీఱిపోవు' పోతన.

అనుసూక్తిని నేర్చుకొనుఁడు. ఇఁకఁ గథ వినుఁడు. మున్ను మాళవదేశమున నొక విప్రకుటుంబ ముండెను. ధన సంపద లేకున్నను సుగుణసంపద యాకుటుంబమునకుఁ బ్రథా నైశ్వర్యముగ నుండెను. దానిచే జనులంద ఱాకుటుంబమును మరియాదతోఁ జూచుచుండువారు. కాలగతి దుర్నివార కము. కావున నాకుటుంబమునం దొకకుమారుఁడు జన్మిం చెను. జనార్దన సోమయాజి యని నామకరణము చేసి తల్లి దండ్రులు గారాబమునఁ బెంచుచుండిరి. గారాబమునుదానికిని మితము కలదు. దానికిమించిన నదియుఁ జెడుగుగాఁ బరిణ మించును. 'అతి సర్వత్ర వర్జయేత్' అని యున్నది కదా! కొంత కాలమున కాబాలుఁడు ముద్దుగాఁ బెంపఁబడినకతన నించుక భేదమున ముద్దు మొద్దుగా మాఱి తుదకు మొద్దే యయ్యెను. చదువన్న వానికిఁ దలనొప్పిగాఁ బరిణమించెను. దుర్బుద్ధులం గూడి తిరుగసాగుట కలవాటుపడి, యాతఁడు మూర్ఖుఁడన్న

ప్రఖ్యాతిని గడించెను. ఆతని కన్నివిధముల నీచుఁడోడుగా నుండు బాలురు పెక్కండ్రు కూడి పలువిధములఁ ద్రిప్పుచు దుర్వ్యవసాయమునకు లోంగఁజేసిరి. ఉపనయనమునాఁటికే యన్నివిధములఁ జెడిపోయెనని యెల్లరెఱింగిరి. పదిసంవత్సరముల యీడు రాఁగా నాతఁడు పెద్దలమాటల లెక్కచేయఁడయ్యెను. నామకరణమహోత్సవమునాఁడు పెట్టిన జనార్దన సోమయాజి యన్న పేరుసార్థకమయ్యెను. జనులను బాధించుటం జేసి జనార్దనపదము, మేఁకలంజంపుటంజేసి సోమయాజిపదము, సార్థక మయ్యెననుట కేశంకలు లేవు. యజ్ఞమున మంత్రములు మాత్రమే యెక్కుడు. ఈతఁడు చేయుయజ్ఞము ఋత్విజు లక్కఱలేకయే సాగుచుండును. కొంతకాలమునకా సోమయాజి సురాపానము చేయుట యొడలెఱుంగక పడిపోవుట యను నీమహాకృత్యములయం దాదరణము కలవాఁడయ్యెను.

తల్లిదండ్రు లాకుమారుని ప్రవర్తనమునకు దురంత చింతాకులస్వాంతు లగుచుఁ జేయునది లేక నలుగురిలోఁ దలలెత్తుకొని తిరుగలేక కృశించుచుండిరి. జననిదుఃఖ మపారము. తండ్రిదుఃఖ మనంతము. వారిరువురను జూచి నపుడెల్లవారును బరితపించువారు. కాని యాబాలు చర్యలం గాంచునపుడు, వినునప్పుడు జాలింగాంచక క్రోధముంబూను వారు. వానితల్లిదండ్రుల కాకుపుత్త్రుని మూలమున నాలుగు చీవాట్లు వచ్చుచుండెను. చీవాట్లుపెట్టి వెంటనే పెద్దల దూషించితిమికదాయని తలంచుచుండిరి. సర్వజన విగర్హిత ప్రవర్తనుఁడై యాసోమయాజి స్వగ్రామము వదలి మనశ్చింతలు మెండగుటంజేసి గ్రామాంతరములఁ దిరుగ నారంభించెను.

తోడిబాలు రొక్కరొక్కరుగా నాతని వదలుకొన సాగిరి. అట్లుచేయుటకుం గారణము వారు బుద్ధిమంతులై కాదనియు నాతనివలన నేలాటిలాభము లేకుండుటయే కారణమనియుఁ బాఠకమహాశయు లూహింతురనియే నావిశ్వాసము. ధనము లేకపోఁగా మనశ్చింతలు పెక్కురీతుల వృద్ధికాఁగా నాతఁడు చౌర్యమున కలవాటుపడియెను. తదనుసారులు కొందఱు తోడ్పాటు చూపిరి. ప్రాఁతమిత్రులు వదలినను క్రొత్తవారికిం గొదువలేక యుండెను. త్రోవలలోఁ బొంచియుండి వచ్చెడు వారిని బ్రహరించుచుఁ గొంతకాలము, ధనవంతుల గేహములలోఁ బ్రవేశించి యెత్తుకొనిపోయి కొంతకాలము ధనముం గూర్చుకొనుచు స్వేచ్ఛగాఁ దిరుగుచు నది వ్యయముకాఁగా మరల దానినార్జింపఁ బ్రయత్నించుచు నది లభింపఁగా వ్యయించుచు మిత్రులం గూర్చుకొని వారికడఁ దనప్రతాపాదులం బొగడికొనుచు వారు బలే యనఁగా నుబ్బుచుఁ దనగతి ముందేమగునో యను విచార మించుకంతయు లేక ప్రవర్తించుచుండెను.

జననీజనకులు విచారసాగరమున మునింగియుండి తుదకు పుత్త్రవిషయమున నపకీర్తిని భరించుటకంటెఁ గ్రొత్త దేశములకరిగి ప్రాణములవదలుటయే యుత్తమమని భావించిరి. వారియందుఁ బ్రీతిగల బంధువులు కొంద ఱందుల కంగీకరింపక యాశ్వాసించుచుఁ గొన్నిదినములకైన బుద్ధిరాక యుండునా యని సమాధానముచెప్పుచు వారిపూన్కి సాగక యుండఁ జేయుచుండిరి. భగవంతు ననుగ్రహము కలిగిన నెట్టి ఘటింపరాని కార్యమునైన ఘటింపవచ్చు నన్న న్యాయమును సార్థకముచేయఁదలంచి కాఁబోలు పిలువకయే వారియింటి

కొక్క సన్యాసి యరుదెంచెను. అంతకుముందే యీవిషయమును గూర్చి మాటలాడుచుండినందున వారికి లోకమేదో యన్నట్లుండెను. యతి యరుదెంచెనని కాని 'కాషాయదండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః' అన్న సూక్తినిగాని తలంపక యాయన యూరక యుండెను. గృహిణిమాత్రము క్షణమాత్ర మూరకయుండి పతి యేల యూరకయున్నవాఁడని తలంచి వడివడి వచ్చి చూడఁగాఁ బతి యధోముఖుఁడై యుండెను. యతివర్యుని జూడలేదని యెఱింగి మహాత్ములు విజయంచేసియున్నవారని తెలిపెను. ఆమాట చెవిసోఁకఁగనే తలయెత్తి చూచి దిగ్గన లేచి వారిపాదములు కడిగి తడియొత్తి పాదోదకమును దోలుతఁ బత్ని శిరస్సుపైఁజల్లి తానునుంజల్లుకొని కూరుచుండఁదగు పీఁటవేసి దానిపైఁ గృష్ణమృగచర్మము నునిచి దయచేయుఁడని ప్రార్థించెను. పరమహంసయు నందుఁ గూరుచుండెను. 'మహాత్మా! ఏదో సంసారతాపములఁ బడియుండి తమ్ముఁ దొలుతఁ జూడఁజాలకపోతిని. క్షమింపుఁ' డని విన్నవించెను. స్వామి నవ్వుచు 'సంతటితాపమేదో తెల్పిన విని నాకుఁ దోఁచినయుపాయము తెలుపుదును. దాన భగవంతుని యనుగ్రహము మీపైఁగలిగిన నాతాపము తొలఁగవచ్చును.' అనఁగానే తల్లి యించుక యూఁ ఆడిల్లి 'మనయదృష్టదేవత వీరిని బిలుచుకొని వచ్చినది. విన్నవింపుఁడు. దాఁపక తెల్పుఁ' డని భర్తను బ్రోత్సహించెను. పతియు నించుకయు దాఁపక కొడుకుదుడుకుచర్యలు విన్నవించి కన్నీరు ప్రవహించుచుండ, 'నేగతి నీ దుఃఖసాగరమును నిస్తరింపఁగలమో సెలవిం' డని ప్రార్థించెను. స్వామి నవ్వుచు 'నిదియేనా మహాకార్యము. ఎటులైన నీకొడుకు నాకంటఁబడునట్లు చేయుఁ' డనునంతలో

నాతనిం గూడి మున్ను తిరుగుచు నిపు డాతనిసంగతి మాని యున్న బ్రహ్మచారి యొకఁడచ్చటికి వచ్చెను. స్వామివాక్కులు విని 'నేనీకార్యమున సాయపడుదు. ఎట్లో జనార్దన సోమయాజిని బిలుచుకొని వత్తును. తరువాత నెట్లు వానిం జక్కని మార్గము నవలంబింపఁజేయుదురో తమచిత్త' మని పలికి పని వినియెను.

ఈయది శుభశకునముగా భావింపుమని స్వామి యాగృహస్థుపుతోఁ బలికెను. చిత్తము, తమ యనుగ్రహము నే నమ్మి యున్నాఁడనని బదులు పలుకుచు నేమో చెప్పఁ బోయి యూరకుండెను. ఏమయ్యా! అనుమానించుచున్నాఁడవు. నీకొడుకువచ్చుదాఁక నన్ను మాయింట నుండుమనిగదా చెప్పఁబోయి యూరకుంటివనఁగాఁ దమ రెఱుంగనిది లేదు. ప్రార్థింపఁజాలకయే యున్నాననెను. స్వామియు నెంతకాలమున కాతఁడు వచ్చిన నుండెదనని మాటయిచ్చి యందే యుండెను. జనార్దనుని పూర్వమిత్రుఁడు మఱుదినమే పోయి యేమో బోధించి సాయంకాలమునకుఁ బిలుచుకొనివచ్చి స్వామియెదుట నిలిపెను. పరమహంసయు నాతనిం గాంచి సంతోషమును దెలుపుమాటల నాతని కుశలప్రశ్నము చేసి కూరుచుండ నియోగించెను. యతిని దర్శింపఁగనే యాతని చిత్తమున నించుక మార్పు పొడసూపెను. లోపలికింబోయి పాదప్రక్షాళనాదికృత్యములం దీర్చివచ్చి స్వామికడఁ గూరుచుండెను. యతియు నియతకృత్యములం దీర్పఁబోవుచు నాతని వెంట రమ్మనఁ జిత్తమని పోయెను.

రాత్రి శయనింపఁబోవు సమయమున యతి వత్సా! యని పిలిచి నాయొడ లించుక దుర్బలముగా నున్నది. పాద

సంవాహన మొనరింపుమా యన నాతఁడట్లే చేయుచుండెను. స్వామి యేవో లోకవృత్తములఁ దెలియఁజేయుచు నాతని చిత్తము స్వాయత్తమగునటులొనరించి నాయనా! నాయాయాసము తీఱినది. నీవును శయనింపుము. రేపు పున్నమకదా. ఉదయమున నాతోడ స్నానమునకు రమ్మని చెప్పెను. అట్లేయని యాతఁడనెను. ఇరువురు నిదురించిరి. వేఁకువజామున లేచి శిష్యునిఁ బ్రబోధించి యాతనిం బిలుచుకొని నదికింబోయి స్నానముచేసి నియతిందీర్చుకొని స్నానముచేసిన శిష్యుని కుడిచెవిలో నేదో యొక మంత్రమును బ్రవేశింపఁజేసెను. బద్ధాదరుఁడై యద్దానిం బలికెను. ఇరువురు నింటికరుదెంచిరి. అనుష్ఠానము ముగియగనే పరమహంస కృష్ణాజినముపైఁ గూరుచుండెను. అంతేవాసియు నాతని సమీపమునఁ గూరుచుండెను. విభూతిరేఖ లాతని లలాటమునఁ గనఁబడుచుండెను. శిరస్స్నానము చేసినందులకు గుఱుతుగా సిగముడి వీఁపున వ్రేలాడుచుండెను. యతివర్యునే చూచుచు నతఁడుండెను. ఆస్థితియం దాతనిం జూడవచ్చినవారెల్ల రచ్చెరు వందసాగిరి. స్వామి యేమో మూలికాప్రభావమున నీతని లోఁబఱచుకొనెను. లేకయున్న నీతఁడు చిక్కువాఁడా యని యనుకొనసాగిరి. కొందఱాతని తల్లిదండ్రులం గాంచి మీరు ధన్యులరైతిరని పొగడఁజొచ్చిరి. వారును గొడుకు బాగుపడఁగలఁడని నమ్మియుండిరి.

పరమహంసయు నాదృతి నొక ముహూర్తకాలము తదేకదృష్టి నాతనిం జూచెను. స్వామిమదింగలయూహ లాతని మదిం బొడకట్టెను. ముందున్న దురూహల కామనస్సునఁ జోటిప్పుడు లేదు. అవి యంతలో మాయమయ్యెను. తానెట్లు

ప్రవర్తించెనో యేపనులఁ జేయ నాతఁడు నిశ్చయించుకొనెనో యప్పుడాతఁ డెఱుంగక యుండెను. పూర్వస్మృతియే యాతని కపుడు లేదు ప్రపంచమంతయుఁ గ్రొత్తగాఁ దోఁచెను. మంత్ర బల మాతని మనస్సునఁగల తలంపులను నిర్మూలము చేయఁ జాలెను. ఇపు డాతని మనస్సున యతికింగల తలంపులే యున్నవి. ఏల? పరకాయప్రవేశ విద్యదగు ప్రభావముననే యనక తప్పునా? ఈవిద్యనే యీకాలమునందు (Mesmerism) అనుదురు. అయ్యది నిర్మలాంతఃకరణులకే యుపయోగించును. భగవద్భక్తి గలిగి పరిశుద్ధములగు నాలోచనములు గలిగి పరోపకారమే యెల్లవేళల నొనరించు నియతి గలిగియుండువారల కావిద్య ఫలించును. దాని మూలమున ద్రవ్యము నార్జింపఁ దలంచుచో నయ్యది నిష్ఫలమగునని పాఠకు లూహింతురు గాక. దాని నెవరుపాసింతురో వారు తమకంటె నుత్కృష్టశక్తి మనస్సునఁగల వారియెడఁ బ్రయోగింపరాదు. అట్లు ప్రయోగించిన నది ఫలింపదు. తమకంటె నెవరు మనశ్శక్తియందుఁ దక్కువగా నుందురో వారియెడం బ్రయోగింపవలయు. అమెరికాయను దేశమునం దొక్కసారి మన దేశమునుండి మతాభిప్రాయమును వెల్లడింప నరిగిన యొక మహనీయులపై నీవిద్యనొకరు ప్రయోగించిరఁట. అది యించుకయు ఫలింపకపోయెనఁట. ఏల? వారి మనశ్శక్తికంటె వీరిమనశ్శక్తి నూఱురెట్లు గొప్పది. కావుననే పని చేయఁజాలకపోయెనని మనమూహింపవలయును. ఇట్టి విద్యల మూలమున నెందఱో యసాధువులు కానున్న బాలురను సాధువులనుగాఁ జేయవచ్చును. కావుననే,

"తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః"
అన్న శ్రీభాగవతవాక్యము కనఁబడుచున్నది. అనఁగాఁ బూర్వ మీవిద్య యెందఱచేతనో యుపాసింపఁబడుచుండె నని యెందఱనో వారు బాగుచేయుచుండిరని మనము గ్రహింప వలయును. క్రొత్తగా నీకాలమునఁ గనిపెట్టఁబడినదని కొంద ఱందురు. అది మిగులఁ బొరపాటు. దర్శన మాత్రంబున సాధువు లితరులను బవిత్రులనుగాఁ జేయు టెట్లు? ఈవిద్యా శక్తిచేతనే యనక తప్పదు కదా. ఈవిషయమును సర్వదా మదియందుఁ దలంచుచుండవలయును.

ఆవ్వేల నొకముహూర్తమునకు జనార్దనసోమయాజి పడి పోయెను. నిద్రపోయెను. తల్లి యించుక వితాకు నొందెను. గాని స్వామి నవ్వుచున్నందునఁ దన్మహత్త్వముననే యని జంకు మాని తనపనిని దాఁ జూచుకొనుచుండెను. నాలుగు గడియ లట్లే పడియుండెను. అంతలో నాతని పూర్వదుష్కర్మవాసనలు నశించినవి. సత్కర్మవాసనలే యాచోట నంకురించినవి. ఇఁక దుష్కర్మవాసనలుపొలయ నందుఁ జోటు లేదు. ఆవిషయ మెఱింగి స్వామి మంత్రోదకమును జల్లెను క్షణకాలమునకు స్మృతికలిగెను. మెల్లగా లేవఁగలిగెను. స్వామియు నిద్రవోయి తివా యని ప్రశ్నించెను. పాడునిద్ర నన్ను ముంచెను. తమ కడ నేనిద్రపోయితిని తెలివితక్కువ పని చేసితినని సిగ్గుపడియెను. వత్సా! లజ్జనొందకుము. అలసితివి. కాన నిదురవచ్చెను. ఇట్టి యాయాస మింక నీకుఁ గలుగకయుండ భగవంతుని బ్రార్థించెదను. అని పలికి జలము మోమునఁ జల్లగా నందు జక్కని వికాసము పొడసూపెను. దాన స్మృతి యథాపూర్వముగాఁ గల్గెను. అంత నతఁడు చేతులు జోడించి నిలుచుంబడి 'నా యప

రాధములనెల్ల క్షమించి మంచి మార్గమును చూపుఁడీ' యని యర్థించెను. స్వామి కూరుచుండ నియమించి 'నాయనా! మానవుఁడు వృద్ధి కావలయునన్న సత్కథల నాలకింపవలయును. వాని మూలమున మంచిమార్గము కనఁబడును. ఒక్కనికి వేఱొక్కరు మార్గము నెంతవరకుఁ జూపఁగల్గుదురు? స్వసహాయముననే కనుఁగొనవలయును. అది సాధ్య మేలాగగునన్న సత్కథా శ్రవణమున నయ్యది సులభ సాధ్యమే యగును. కావున నీకు సత్కథల వినుపింతును. ఆలకింపుము' అని ప్రహ్లాద చరిత్రము, ధ్రువోపాఖ్యానము, కుచేలోపాఖ్యానము, అంబరీషోపాఖ్యానము లోనగు మహాభక్తుల చరిత్రములు చక్కఁగా బోధించెను. శ్రీ మహావిష్ణుభక్తుల చరిత్రములు వినుచున్న కొలఁది నాసోమయాజిహృదయము కరఁగఁజొచ్చెను. ఆభక్తు లెట్టికష్టముల ననుభవించినదియు నెట్టిభక్తి భగవంతు నారాధించినదియుఁ దుదకు వారి కాపరమేశ్వరు ననుగ్రహ మేలాగు లభించినదియును జక్కఁగా మననము చేసికొనఁ బూనెను. దాన నాతనిమనస్సు పరిపక్వమై భగవద్భక్తి పూర్ణమై భూతదయాసాంద్రమై యలరారెను. కొలఁది దినముల కాపరమహంస యతని చిత్తము పరిపాకావస్థ నొందెనని యెఱింగి తల్లిదండ్రుల కాశుభవార్తం దెలిపి వారెట్టకేల కనుమతింపఁదనదారిఁబోయెను. రాజకుమారులారా! సత్కథా శ్రవణమున నంతటి దుర్వినీతునిబుద్ధియు మార్పునొందెను. పరమేశ్వరుని కథలు, భక్తులచరిత్రములు వినుచున్న కొలఁదిని సంతోషమును బెంపొందించుచు దుర్వృత్తులనుండి మరలించుచు సద్వృత్తుల నవలంబింపఁ బురికొల్పుచుఁ గ్రముముగా సాధుమతిం జేయును. కావున మీరు సర్వదా సత్కథల నాల

కించుచు నుండుఁడు. దాన నపరిమితానందము చేకూరఁగల” దని బోధించి సాయంకాలము కాఁగాఁ దన కృత్యములనొన రింపఁ దాఁ బోయెను.

సీతారామ, సూర్యనారాయణవర్మ లిరువురును సాయం కాలవిధుల నిర్వర్తించి ఫలాహారముచేసి యించుక సేపు యోగివర్యునితో నిష్టాగోష్ఠిఁ గాలముపుచ్చి సుఖనిద్ర చేసిరి. నాలవయామమున మేల్కాంచి యథాపూర్వముగా విధులం దీర్చి వనమున కరిగిరి. ఆనాఁడు వారు పశ్చిమభాగమునకుం బోయిరి. అచ్చోట విశేషించి ఛాయాద్రుమములు కన్నుల పండువు చేయుచుండును. చల్లగాలి విసరుచు వారల కెంతయో యానందమును గూర్చుచుండెను. మరల గ్రామమునకుంబోయి యెట్లు బ్రదుకఁగలమని వారు తలపోసికొనఁ బూనిరి. మాట లాడుచుఁ గొంతదూర మరిగిరి. అందు విశేషించి కుసుమిత లత లుండెను. వానియందము వర్ణనాతీతము. ఆతీఁగలు వృక్ష ముల నల్లికొని తుదకు నది తీఁగలజొంపమే యని భ్రమింపఁ జేయుచుండెను. వృక్షశాఖల నొక్కింత భాగమేని కానరాక యుండెను. ఎల్లతావులఁ బుష్పములే కానవచ్చుచుండెను. వాని పరిమళముల నాస్వాదింపఁ గోరనివాఁ డుండఁడు. చూచుచు వానియల్లిక బిగువును బరికించుచుఁ గొంతదూరము పోయిరి. అందుత్తరభాగమున జలధారలు ప్రవహించు చుండెను. వానియొడ్డున నొక్క లతామండప మగపడెను. అది విశాలభూభాగము నాచ్ఛాదించి యుండెను. వికసించిన పూవులు పత్త్రములదర్శింప నవకాశ మీయనట్లుండెను. ఆలతా మండపముమీఁద ఝుంకారములు చేయుచుఁ దుమ్మెదకదు పులు కనఁబడెను. అందొక్కచో నొక్క తుమ్మెద యూరక

తిరుగుచు ధ్వని చేయుచుండెను. అందేమియున్నదని వారు పరికించిరి. అందొక్క చిన్ని పచ్చని పురుగు కనంబడెను. దాని చుట్టు మధుకరము తిరుగుచున్నయట్లు వా రూహించిరి. ఆ పురుగు దానినే చూచుచున్న ట్లుండెను. ఒక్కతావుననే యది భ్రమింపనేల యని వా రచ్చెరువందుచు నిలువంబడిరి. వారు తొలుతఁ జూచునప్పటి యాకృమివర్ణము వారందుఁ గొంత సేపు నిలువంబడి చూచునప్పటికి మార్పునొందెను. కారణ మేమని చూడసాగిరి. చిన్ని ఱెక్కలు కనఁబడెను. అది భ్రమ రమును జూచుచుఁ గదలుచున్నట్లుండెను. మఱియొకటి రెండు గడియలకు లేచి యటునిటు తిరుగసాగెను. ఇదేమియాశ్చర్య మని సూర్యనారాయణరా జడిగెను. "మిత్రమా! కొన్ని దిన ముల క్రిందట నొకపాఠమున 'భ్రమరకీట న్యాయ' మను దానిం జదివితిని. అద్దాని యర్థమేమని యొక శాస్త్రులుగారి నడిగితిని. భ్రమరము పురుగును భ్రమరముగా మార్చుననియు దానింగూడి యది యెగురుననియు వా రర్థము చెప్పిరి. కాని నే నదియంతయు నబద్ధమని యూహించితిని. ఇపుడు మనము చూచుచుండఁగనే యది యెగురుచున్నది కదా. ఔరా! మన పూర్వు లెంతటి మహాత్ములు! వా రెన్ని విషయ ములఁ జక్కఁగాఁ బరీక్షించిరి! వారికింగల బుద్ధిబల మింత యని వర్ణింపఁ గలమా? దీనిం బరిశీలింపఁగాఁ బ్రాజ్ఞుఁ డెంత యవివేకి యగు శిష్యునైనఁ బ్రజ్ఞావంతునిగాఁ జేయఁ గలఁ డనియు, శిష్యున కదృష్టము గలిగెనేని శ్రద్ధాశోభితాంతఃక రణుఁడగు సద్గురువు చేకూరుననియుఁ దెలియవచ్చెడిని. శ్రద్ధ యనునదియే యమూల్య పదార్థము. అది కలిగిన నెంతటిపని నైన సాధింపవచ్చును. మనము చేయఁబూను కార్యముల

యందు శ్రద్ధగలవారము కావలయును. అది కుదిరినచో నెట్టి కార్యమునైన సాధింపవచ్చును. ఈ న్యాయము మనకుఁ దెలియఁజేసినది యీ తుమ్మెదయే కదా. ఒక్క చిన్నిపురుపు మన కెంత యమూల్యనీతిని దెలిపెను! మన కిదియు గురుపరంపరలోఁ జేరినదియే కదా." అని యాషట్ప దమును గొనియాడి యించుక దూరము నడిచిరి. అందొక్క ద్రాక్షలతాకుడుంగము కనఁబడియెను. అది విశాల భూభా గము నాక్రమించుకొని యుండెను. దానికి స్తంభములం బోలి దగ్గఱగా వృక్షములుండెను. పెట్టని పందిరిగా నది యేర్పడుట వింతగా నుండెను. చూడంజూడ నది వలయునని నిర్మింపఁబడి యుండునా యను ననుమానము వారలకుంగల్గెను. నిలువంబడి చూడసాగిరి. తుదకదిదైవనిర్మితమే కాని మనుష్య కల్పితము కాదని తోఁచెను. మధురఫలగుచ్ఛము లందు వేల కొలంది వ్రేలాడుచుండెను. పండ్లగుత్తులు కొన్ని యాకాశము కేసి చూచుచున్నట్లుండెను. స్పష్టముగాఁ గనఁబడినఁగాని వాని నుపయోగింపరని యాలతామండప మూహించి యట్లులోన రించెనాయని దానింగాంచువా రూహింపకపోఁజాలరు. సీతా రామవర్మ "ప్రియమిత్రుఁడా! చూచితివా పండ్లగుత్తు లెంత వింతగానున్నవో! పరిపక్వఫలములనుండి రసము స్రవించు చున్నది. కావుననే యాజలధార లించుక యెఱ్ఱనిరంగుగల విగ నున్నవి. చూడుము. వృంతచ్యుతములై ఫలములు జల ముల వెంటఁబోవుచున్నవి. ఆవంక దృష్టి నిగిడింపుము. తొండలు ఉడుతలు ఫలములఁ దమ కోమలదంతములఁ గొఱుకుచున్నవి. సావ్రేలువెంట దృష్టిపోనిమ్ము. ఆయుడుత తోఁక నెగుర వేయు చుఁ దానెచ్చటికో యెగుర నుంకించుచున్న జాడ కనుపట్టెడిని.

తొండల కిన్నిరంగులుండునని మన మెఱుంగుదుమా? బూడిద రంగుగలవి కలిసి యొక్క చక్కిగనున్నవి. ఎఱుపురంగుగలవి చేరి యొక ప్రక్క నున్నవి. రక్తపీతవర్ణములు కలవన్నియు నొకవైపునఁ గూరుచున్నవి. ఏల? వీనిలోఁగూడ జాతిభేదములు కానవచ్చుచున్నవి. స్వజాత్యభిమానము వీనికిని గలదని స్పష్టమయ్యెడిని. మిత్రమా! ఇవన్నియు నొక్కచోఁ జేరి హాయిగాఁ దమయాహారమును సంపాదించుకొనుచు నొక్కదానితో నింకొక్కటి సంభాషించుచు హాయిగాఁ గాలముపుచ్చుచు సంతోషించుచున్నవే. ఇట్లే మానవు లేల యుండరాదు? ఒక్కతెగవార లొక్కచోఁ జేరినపుడు కలహించుటతప్పఁ బరస్పరస్నేహభావము గనఁబడుటఁ బూనరే? ఏటికో? వీనింజూచియైన మనము నేర్చుకొనఁ గూడదా? ఇట్లుండుటకుం గల ప్రధానకారణమేమి? పదార్థముల సంగ్రహింపవలయునన్నయాశ మానవులకుం గలదు. వీని కయ్యది లేదు. ఆశాపాశము మానవుల నెంత బాధించుచున్నది. అది యొక్కటి లేకయున్న నెంత సుఖముగా జీవితము గడుపవచ్చును? ఇవెంతపుణ్యము చేసినవి! మఱొక్కవిశేషము నామదిఁ బొడకట్టుచున్నది. ఇవన్నియుఁ జేరియున్నవికాని దేనియాహారము నయ్యది సంపాదించుకొనుచున్నది. అందొక్కతొండపిల్ల మాత్రము తల్లి యాహారమందియ్యఁ గైకొనుచున్నది. మానవులలో నీయాచారము లేదు. ఒక్కరిపైన బెక్కండ్రాధారపడి యుందురు. ఎందఱినో యొక్కఁడు పాటుపడి కాపాడవలసి యుండును. కావున నాతఁడు మితిమీఱిన శ్రమములకు లోనుగావలయును. తక్కినవారు సోమరులై హాయిగాఁ గూరుచుండి భుజింతురు. కాని వారట్లు సోమరులగుటచేఁ దమలాభమును

బోఁగొట్టుకొనుచున్నవారు. కావుననే మానవులకు సంతో షము శబ్దనిష్ఠమైయుండును. సీ! సీ! మానవజీవిత మెంతదుఃఖ భాజనము? ఇవి నీచజంతువులా? మానవు లుత్కృష్టులా? ఈ విషయమున నివియే మానవులకంటె నుత్కృష్ట జంతువు లని నేనూహించువాఁడను. నీభావమేమి?' అన 'నాయాశయ మట్టిదియే' యనెను. మనమీదినమున నేర్చుకొన్న యీరెండు నీతుల నాచరణమునఁ బెట్టవలయునన మిత్రుఁడట్లే యొనరింత మనెను. సీతారామవర్మ యాకసముం గాంచి 'సఖా! మధ్యా హ్న కాలలక్షణములు గానవచ్చుచున్నవి. గురువులవారు సమాధ్యవస్థనుండి లేచువేళ యైనది. పోవుదమా'యన నతఁడు నందులకు సమ్మతింప నిరువురు నాశ్రమమున కరుదెంచిరి.

వారువచ్చిన కొలఁదినిమేషములకు భగీరథదాసు లేచి వచ్చి వారలంగూడిపోయి కుండికలో మునింగి కృత్యముల నెఱ వేర్చి యరుదెంచి ఫలాహారమున సంతుష్టినొంది వారలట్లే కాఁగాఁగూరుచుండిమాటలాడుచు 'నేఁడుకూడ మీరు రెండు నీతులు నేర్చుకొనఁగల్గితిరి. అవి మానవజీవితమున ముఖ్య ములే.' అన, వా రచ్చెరువంది యేమి యుపదేశించునో యని యెంచుచుండిరి. యోగి,బాలకులారా! నిన్న సత్కథాశ్రవణ మునుగుఱించి ముచ్చటించితిని. నేఁడుదైవభక్తినిగూర్చి మాట లాడెదను. కడు నవధానమున వినుఁడు. ఈవిషయము బుద్ధి నాటుట కష్టము. కావున ముందే హెచ్చరించుచున్నాను. మనస్సు నితర విషయములయందు వ్యాపింపనీయక తదేకా గ్రముగ నుంచిన నెట్టివిషయమైన నాటును. మన స్సమూల్య వస్తువు. దానిని మంచిమార్గమునఁ బ్రవర్తింపఁజేసిన నెంతలా భమో యది యనుభవమునఁగాని యెఱుంగఁదరంబుగాదు.

దుష్పథమునఁ బ్రవర్తింపఁజేయ నది మలీమసమగును. మీరు చక్కఁగా నీవిషయము నెఱుంగవలయును. దీనినెఱుంగుటకుఁ జదువక్కఱలేదు. కపటములేని గురూపదేశము చాలును.

## దైవభక్తి.

పరమేశ్వరునియందుఁ బ్రీతి నునుపవలయు. ఆప్రీతికే భక్తియనిపేరు. దైవమునందుఁ, దల్లిదండ్రులయందు, గురువు నందుఁగలప్రీతినే భక్తియనిపిలుతురు. సోదరప్రభృతులయంద ది ప్రీతియనఁబడును. భార్యయందుఁ గలదానినే ప్రేమమందురు. భూతములయందుఁ గలదానినే దయయందురు. ఇది పూర్వ మనీషుల యాశయము. భగవంతుని బ్రేమించెను. భార్యను భక్తిచే గారవించెనన్న లోకమర్యాదకు విరుద్ధముగ నుండును. అట్టిశబ్దముల నుచ్చరించినఁ బాపములేదు. మనము లోకమర్యాదను వలనుపడునంతదనుకఁ బాటింపవలయును. మనకుఁగల ప్రీతియంతయు భగవంతునిపైఁ జేర్పవలయును. దాన మనకుఁ బరమేశ్వరునకు నొకసంబంధతంతు వేర్పడును. అది స్వతస్సిద్ధముగ నుండునదియే. కాని దానిని మానవులు విస్మృతిఖడ్గముచేఁద్రుంచివేయుచుందురు. అదితెగిపోవదు కాని కృశత్వమును గాంచును. దానిని స్మరించుచున్న నయ్యది దృఢ తం గాంచును. అట్టిస్థితియందది సూక్ష్మదృష్టింబరికించినఁ గనఁ బడుచుండును. ఇట్టితంతువు లనేకములున్నవి. ఆకాశమున నున్నట్లుండు గ్రహములకు మనకు నట్టితంతువుల సంబంధము కలదు. కావుననే గ్రహముల నారాధింపవలయునని పూర్వులు పలికిరి. ఆపూజ మానవుల యభివృద్ధికి హేతువగును. దానిని మానిన నభివృద్ధియుఁ జేకూరదు. పితృదేవతలకు మనకు నట్టి

సంబంధమును దెలుపు తంతువు గలదు. కనుకనే మానవులు పితృపూజ మానరాదని శాస్త్రములు నిర్ణయించినవి. ఈరీతిగా నొకమానవజాతివృద్ధి కెందఱో పాటుపడుచుందురు. వారిని మనము పూజింపక యుండినఁ గృతఘ్నుల మగుదుము. మానవేతరజాతులగతి యేమని ప్రశ్నింతురేమో. జ్ఞానశక్తి గలిగి జన్మించిన ప్రతిమానవుఁడు తనసత్కర్మముల ఫలములఁ గొంత భాగమిచ్చి కాపాడవలయును. ఫలము నేలాగిచ్చుట యని సందియమొందకుఁడు. వానిని దయతోఁజూచుటయే యద్దాని నొసంగుటయని గ్రహింపుఁడు. కనుకనే భూతదయ ప్రధాన ధర్మమని పెద్దలు నిర్ణయించిరి. భూతదయలేని హృదయ మెవ్వానికుండునో యాతనికిఁ బశువునకు భేదమాకారమున మాత్రమే యని యెఱుంగుఁడు. ఇట్టి మహోపకారము చేయఁగలఁడనియే మానవుని యభివృద్ధికి నిందఱు పాటుపడు చున్నవారని నమ్ముఁడు. ఎవ్వఁడు స్వార్థమునందే ప్రవర్తించునో వానియభివృద్ధికి నెవ్వరు పాటుపడరని నిశ్చయింపుఁడు. అట్టి భక్తియను నామాంతరముగల ప్రీతి నెవ్వారు స్మరింపకుందురో వారే పశువులు. అయ్యది యేరూపమున మానవుని మేలునకుఁ దోడ్పడునో యెఱింగించెదను.

మళయాళదేశమున మంగళవతియను పేరుగల యొక యగ్రహారము గలదు. అందుఁ బెక్కండ్రు ద్విజులు కాపురముండిరి. వారిలో నొక వైశ్యకుటుంబముండెను. దారిద్ర్యమున నాకుటుంబము శ్రమంపడును గాని శీలమున సుఖపడుచుండును. సాధారణముగా శీలవంతుల కైశ్వర్యము నెలకొనుట కష్టమే. ఐన నాకుటుంబమువారు దుర్వృత్తులఁ జొరఁబడక యెట్లో కాలము పుచ్చుచుండిరి. వారియింటఁ బెక్కండ్రు

బంధువులు నుండిరి. వారి సోదరులలోఁ గొండిక సదాశివ గుప్తయనువాఁడు కుటుంబము పెద్దదగుట, సంపాదించువారు పెక్కండ్రు లేకుండుట, పూటపూటకు భుక్తి దొరకుటయే కష్టమగుట యను కారణములం బరికించి, యిఁక నూరక యుంట పాడిగాదని యూహించి పెద్దవారికడ సెలవు పుచ్చుకొని బేహారము చేసి ధనము సేకరింతునని పయనమయ్యెను. తల్లిమాత్ర మంగీకరింపక 'నాయనా! తీఁగకు కాయ బరువగునా? మేము తినునాహారమే నీకు నుండదా' యని వగచెను. తల్లి మనస్సూఱడిల్లు మాటలు చెప్పి దుర్భరమగు సంసారయాత్రకు స్వశక్తి ననుసరించి తోడ్పడుదునని యక్కడికెంతో దూరముగాని నగరమును మహాశయనమను దానిం జేరి నలువురు వర్తకుల నాశ్రయించి మంచివాఁడనిపించుకొని వర్తకము సాగించుచుండెను. అందుఁ జేరిన మూఁడు నెలలకే గొప్ప లాభము వచ్చెను. అందుఁ గొంతభాగము తల్లికిం బంపివేసెను. ఆమెయు సోదరులును మహానందము నొంది యాతనికిం బాసటయైయుండ నింకొక్కసోదరుని భోజనము సమకూర్పఁ బిన్నతల్లిని బంపిరి. దిక్కులేని యాపినతల్లి యాతనికడం జేరి వారిని రక్షించుచుండెను. క్రమక్రమముగా వ్యాపారము ధనవంతముగనే సాగఁజొచ్చెను. కుటుంబమునకు వస్తువ్రాతమును బంపుచు ద్రవ్యము కూడ నంపుచు నాతఁడు కాలముఁ బుచ్చుచుండెను.

ఒక్కనాఁ డాతఁడు చేరువగ్రామమునకుం బోయి సరకులఁ గొనవలసివచ్చెను. అందలివారు పలుసారులు రమ్మని పిలుచుచుండిరి. ఆనాఁడు పనుల తొందఱలు లేనందునఁ బయనమయ్యెను. పిన్నతల్లికిం దెల్పి సోదరున కంగడి యొప్పగించి

తాఁబోయెను. అందలివారుకూడఁ బోవుచుండిరి. చేరువనుండు నదిగాన జనులు నగరమునకు విశేషించి వచ్చుచుం బోవుచుండు వారు. ఆనడుమ నొకచిన్న యడవియు దానియందే యొక చిన్న నదియు నుండెను. గ్రామమునకుం బోయి రెండుమూఁడు దినములుండి సరకులఁగొని యింటికింబంపి రేపువత్తునని కమ్మవ్రాసి యారేయి నాయూర నొకయుత్సవము భగవతియాలయమున సాగుచుండ నద్దానింగాంచి సంతోషించి సుఖనిద్ర నారాత్రి శేషమునుగడపి పయనమయ్యెను. ఊరివారెల్లబతిమాలి నేఁటి వసంతోత్సవమునఁ బాల్గొని పొమ్మనిరి. అందుల కంగీకరించి యామహోత్సవమును గన్నులారఁ గాంచి యాభగవతిని సేవించి యెండగానున్నందున సాయంసమయమునఁ బయనము సాగించెను. ఊరివారెల్ల సాగనంపిరి. ఎందఱో వచ్చుచుం బోవుచుందురు. కాన రాత్రియందు నామార్గమున నేబాధ లును లేకుండెను. సాయము గోరువారాఁడువారు మాత్రమే యుందురు.

కొలఁది బాహువు లంతదూరము పోయెను. ఇంకను నాలుగైదుగడియల ప్రొద్దుండెను. అచ్చోటనే నదియుండెను. దాని యిరుగట్లయందును విశేషించి పొదలుండెను. నదిని దాఁటి దేహబాధఁ దీర్చికొనఁగోరి మార్గమువదలి యించుక దూరముపోయి మరలివచ్చుచు నొక క్రొత్తదారి కనఁ బడఁగా నదియే తాను బోవఁదగునది యని పొరపడి దాని వెంటఁబోయెను. ఆకాలిత్రోవ తృణ్ణమైనదియే. కాని మహా శయనమున కది పోవక వేఱొక గ్రామమునకుఁ బోవునది. అందును గొందఱు రాకపోకలు చేయుచుందురు. వచ్చువారు కనఁబడిరి. కాన సంశయమొంద నవకాశము లేమి నతఁడు

పోవుచుండెను. కొంతదూరము పోవునప్పటి కిది క్రొత్తదిగా నగపడుచున్నదే యని యతనికిం దోఁచెను. కావున నించుక తడవు నిలువంబడెను. వచ్చెడువారుగాని పోవు వారుగాని కానరారైరి. ఏల యీత్రోవ నాశ్రయించితినని యతఁ డాలోచింపఁ జొచ్చెను. సూర్యుఁడస్త్రాద్రి కరుగునదనుగ నది కనఁబడియెను. ఇఁక వెనుకకుఁ దిరిగి పోవుటొప్పుగదా యని యూహించి చూడఁగా ముందడవి చాలదూరము లేనియట్టి గుఱుతు లగపడెను. ముందూరుండునన్న యాశ తన్నుఁ బురి కొలుప నతఁడు వడివడి నడచెను. అడవి యంతమయ్యెను. గ్రామము కానరాలేదుకాని వనములు దృగ్గోచరములయ్యెను. వానిందాఁటగా గ్రామము లుండునని భావించి సదాశివగుప్త మఱికొంతదూరము పోయెను. అస్తమయమయ్యెను. ఇంచుక దూరమునుండి మనుష్యులు మాటలాడుచున్న శబ్దము వినఁ బడెను. కొంకుమాని ముందునకు నడువసాగెను. కొలఁది బాహువుల మేర పోవఁగా రెండుతాళవృక్షములుండు చోటువచ్చెను. ఆచోటు నిర్మలముగాఁ దోఁచెను. ఇసుక దిన్నె లందుండెను. అంధకారమింకను వ్యాపింపక యుండెను. ఇంచుకయాలోచించుచుఁ ద్రోవ యేల తప్పెను? ఇందు నన్నె ఱింగినవా రెవ్వరుందురు? అనుకొనుచు జనులసద్దు వినఁబడిన తావునకుఁ బోవ నూహించునంతలో నిరువురుస్త్రీలు శుభ్ర వస్త్రాలంకృతలై కనఁబడిరి. 'అమ్మా! యిచ్చటి కెంతదూరమున నూరుగల'దని యడిగెను. అందులో నొకతుక 'అయ్యా! ఈ సమీపమున గ్రామములేదు. కొంచెముదూరమున గ్రామ మున్నది. మీరిపుడా గ్రామమునకుఁ బోవఁజాలరు. ఈవన మున మామేడ యున్నది. మావారెల్ల నిపుడే గ్రామమునకుఁ

బోయిరి. మరలఁ గొలఁదిముహూర్తముల కే తెంతురు. మీరు దయచేసి యీరేయి యిందుండి రేపుదయము మీమార్గముననే మీనగరమున కరుగవచ్చు' ననెను. మిక్కిలి మరియాదతో నామెభాషణములు కూడియున్నందున నింకెక్కడికిఁబోవను వలనుపడమి నా మేడకడకుం బోయెను.

ఆసౌధ మద్వితీయముగనుండెను. దానిచుట్టు నుద్యానవనము కలదు. మనోహరముగా దానినడుమ నామేడ గనఁబడెను. ఎవ్వరో రాజులుగాని కోటీశ్వరులుగాని కట్టినట్లేయది యుండెను.మరియాదగాఁ బిలుచుకొనిపోయి యుపరిభాగమున నొకగది యాతనికింజూపి యిందుండుఁడని పలుక నాతఁడు త్రోవతప్పినను రాజభవనము దొరకినదని యానందించుచుండెను. మీకు భోజనమేమి కావలయుననఁగాఁ 'బ్రొద్దుపోయి భుజించితిని. ఆఁకలి యించుకయు లేదు. మంచినీరుండినఁ జాలు'ననెను. 'అయ్యా!మాయింట వివాహము చేసికొన్న స్త్రీలు పరపురుషుల కగపడరాదని యాచారము కలదు. నాకింకను వివాహముకాలేదు. ఆమె నాచెల్లెలు. మేమిరువురము మాటలాడవచ్చును. వివాహానంతరము మేము నట్లే యుండవలయును.' అని యామె పలికి క్రిందికిఁ బిలుచుకొని జలాశయము నగపఱచెను. సంధ్యనుపాసించి తీయని జలములఁ ద్రావి యతఁడు యథాస్థానమును జేరెను.

ఆయువతి కొలఁదిగడియలు కానరాకపోయెను. రాజవంశమున జనించినవారని భావించి యా సదాశివగుప్త పట్టుపఱుపుపై శయనింప జంకి తాటియాకుల నల్లిన యొక కటమందుండ దానిపైఁ గూరుచుండి యుండెను. ఆయువతి కిరువది వత్సరములకుఁ దక్కువ వయస్సున్నయట్లతఁ డనుమానమున

నెఱింగెను. 'ఇంతయందగత్తె యయ్యుఁ దన్ను గారవమునఁ బిలుచుకొనివచ్చి మంచితావు చూపెనే, ఎంతటి గొప్పబుద్ధి యీమెకుఁ గలదు!' అని యబ్బురపడుచు నతఁడుండెను. ఆతని కడ నొక తాటియాకుల పుస్తకము గలదు. అందు భగవతీ మంత్రము, స్తోత్రము, పంజరము, కవచము లోనగునవి కలవు. స్తోత్రపారాయణము చేసి శయనించుట యతని యాచారములలో నొక్కటి. తాటియాకులతో నల్లిన కటముపైఁ గూరుచుండి పారాయణముచేయ నారంభించెను. "పిశాచగణసంహర్త్రి ప్రధానపురుషేశ్వరి" అన్న వాక్యమా స్తోత్రమునఁ బదియవశ్లోకమునఁ బూర్వభాగము. అద్దాని నుచ్చరింపఁగనే యెందోయుండి తోడి పిశాచముం గూడి దురాలోచనము చేయుచున్న యాపిశాచమునకు దేహమంతయు మండనారంభించెను. ఆ బాధ కయ్యది తాళఁజాలక యెట్లో భరించి పరువెత్తివచ్చి 'యేమయ్యా! యేమి చేయుచున్నాఁడ' వనెను. పారాయణముచేయుతఱి మాటలాడఁ గూడదన్న నియమము కలవాఁడగుట బదులు చెప్పక తనపని తాఁ జేయుచుండెను. మఱికొన్ని శ్లోకములు పఠించుసరికా కోమలదేహము వికారముగా మాఱెను. అప్పటి దానియాకృతి చూడ భయంకరముగా నుండెను. అంతలో సదాశివగుప్త కనుఁగొనెను. ప్రాణముల మీఁది యాస మానెను. కాని యా పారాయణమహత్త్వము కదా యని యించుక నిబ్బరము కలుగఁగా మఱింత గట్టిగాఁ బఠింప నారంభించెను. రెండవ పిశాచ మెందుండియో పరుగెత్తుకొని వచ్చి యాతనిం జంపఁబూని సమీపమునకు రాఁజాలక 'యా పాడుపుస్తకము నావలఁ బాఱవేయుమా' యని గర్జించెను.

ఆపుస్తకము చెంతనుండఁగా భయము కలుగదన్న భావము దృఢపడిన కారణమున దానిం బదిలముగాఁ జేతఁ బట్టుకొని నియతి వృద్ధికాఁగా భక్తి మఱింత దృఢముకాఁగాఁ బ్రాణములపై నాస యుప్పొంగఁగా గట్టిగాఁ బఠింప నారంభించెను. కొలఁది నిమేషముల కాపిశాచములు గట్టిగనార్వ నారంభించెను. సదాశివగుప్త మనస్సున భక్తిరసము సంపూర్ణముగా వ్యాపింప నాపరదేవిని బ్రార్థించుచుఁ దదీయప్రభావమును వేనోళ్లఁ గొనియాడుచు నాస్తోత్రమును రెండు మూఁడు సారులు పారాయణము చేసెను. ఇచ్చట భక్తి హెచ్చుకొలఁది వాని యార్భాటము క్షీణింపనారంభించెను. తుదకారెండును దూరముగాఁ దొలఁగి పోవవలసివచ్చెను. అవిపోవఁగా నాతఁడుండు నది తాటిచెట్టయ్యెను. వాస్తవముగా నది తాళద్రుమమే. అట్లగపడఁజేసిన వాపిశాచములే. అవి తొలఁగఁగా నది నిజరూపమును దాల్చెను. తెల్లవారుజాము దనుక నెట్లో పారాయణము చేయుచుండి పదంపడి యాత్రోవఁ బోవువా రాతని యవస్థం గాంచి పలుకరింపఁగా వారికిఁ దన దురవస్థ నెఱిఁగించి వారు సాయపడ రాఁగా నమ్మఁజాలక మఱింత గట్టిగాఁ బారాయణ మారంభింపఁగా వారా చోటునఁ గలభయము విన్నవారు గాన నతఁడు భక్తుఁడు కాన బ్రతికెనని యెఱింగి తెల్లవాఱుదనుక నందుండి యాస్థల వృత్తాంతమంతయు నెఱింగి యెట్లో క్రిందికి దింపి భయముతీర్చి మరల నాగ్రామమునకే పిలుచుకొనిపోయి విడిచిరి. వారావృత్తాంతమును విని యచ్చెరుపడి భయముఁదీర్చి యాతనిం బిలుచుకొని మహాశయనమునుం జేర్చిరి. పిన్నతల్లియు సోదరుఁడు నాతని యారేయి దురవస్థల విని వగచిరి. భగవతిని వేనోళ్లం

గొనియాడిరి. క్షత్రియకుమారులారా! అట్టి యాపత్కాల మున నాతనిం గాపాడినదేది? దైవభక్తియే కదా. ఆనాఁటి నుండి యానగరమునందె కాక దేశమునందంతటను వాని ప్రఖ్యాతి వ్యాపించెను. కావున మీరును భగవద్భక్తికలవార లు గావలయును. అదియే మిమ్ము వృద్ధికిం దెచ్చును." అని తెలిపి సాయంకాలము కావచ్చినందున నిత్యకర్మానుష్ఠానమునకుం బోయెను. వారును గాల్యకృత్యములం దీర్చుకొని యిష్టాలాప ములఁ దుష్టినొంది యోగివర్యునింగూడి సుఖనిద్ర చేసిరి.

వేఁకువజామున లేచి దానువెంట నరిగి కుండికయందు మునింగివచ్చి కాల్యకృత్యములం దీర్చుకొని వనయాత్రకుం బయనమైరి. ఆనాఁడు వారుత్తరదిక్కునకుఁ బయనము సాగిం చిరి. ఆనాఁడు వారిమనస్సు లత్యంత సంతోషమునఁ బరవశ ములై యుండెను. ఆభాగమున వృక్షములు నీరంధ్రములుగా నుండెను. అడుగిడు జాడ కానరాకుండెను. ఎట్లు ప్రయాణము సాగునాయని వారూహింపసాగిరి. ఎట్లో శ్రమంపడి పదిబాహు వులమేర నడిచిరి. ఇరుకుదారి యొక్కఁడు దొరకెను. దానిం బట్టుకొని యొకటిరెండు క్రోశముల దూరమరిగిరి. తక్కిన మూఁడుభాగములకంటె నాదిక్కున నడవి దట్టముగానుండెను. ఆకసమును దాఁకుచున్నట్లు భూరుహము లుండెను. అంతియ గాక తీఁగలల్లుకొని యున్నందునఁ బ్రవేశింపఁ దరముగానట్లుం డెను. ఎట్లో కొంతదూరము పోవఁగల్గిరి. అందొక్కచోట విశాలస్థలము కనఁబడియెను. ఇందుఁ జూడఁదగు విశేషము లుండునని వారు సంభావించిరి. అచ్చటికిఁ బోవఁగా నాబయలు చుట్టును వృక్షములుండెను. కార్యార్థము సంస్కరించిన యట్లు లాస్థలముండెను. వీరందుఁ బ్రవేశించి దానిరామణీయ

మునకు మెచ్చుకొనుచుఁ దిరుగుచుండిరి. తూర్పుభాగమున నొక్క భూరుహము గడుంగడుం బెద్దదిగా నుండెను. దాని చుట్టును దీఁగ జొంపము లుండెను. ఎందుండియో యొక ధేను వచ్చుటికి వచ్చి మేయుచుండెను. అంత పెద్దయావును వీరం తకుమున్నె న్నఁడును జూచియుండ లేదు. పాలకంటె దెల్లగా నదియుండెను.ఏనుఁగంతయెత్తుగా నది కనఁబడెను."మిత్రుఁడా! యాధేనువును గనుఁగొంటివిగదా" యని సీతారామవర్మ ప్రశ్నించెను. "తొలుతనే యాగోవును జూచితి"నని సూర్యనారాయణవర్మ బదులుచెప్పెను."అది ధేనువనందగును. పాలిచ్చు నావును ధేనువని పిలువవలయునని పెద్దలనఁగా విన్నాఁడ"నని సీతారామవర్మ తెలిపెను. దానిని జక్కఁగాఁ జూచిరి. చెంతకుఁ బోయిరి. నమస్కరించిరి.వారికద్దానిదర్శనమున నొక్కవిధమగు నుత్సాహము పొడసూపెను. సీతారామవర్మ యిట్లు పలికెను.

"సఖా! వినుము. శ్రీకృష్ణపరమాత్మ గోవులఁ గాచెనని విన్నారముకదా! ఏల ? గోరక్షణము ప్రధానమని లోకులకు బోధించుటకే కదా. ధర్మము గోరూపమునఁ గనఁబడునని స్మృతులు తెలుపుచున్నవఁట. ఏల? గోపూజ యొనరించిన సకలధర్మముల నాచరించిన ట్లగుననియేకదా మనము గ్రహింప వలయును. సకల దేవతలు ధర్మము నాశ్రయించి యుందురు. ఆధర్మమే రూపమును ధరింప నెంచినపుడు గోరూపమును దాల్చును. గోవును బూజింప సకలదేవతలఁ బూజించిన ట్లగు ననికదా మన మెఱుంగవలయును. ధర్మమే భగవత్స్వ రూపము. కావున గోవు నారాధించిన సకలధర్మముల నారాధించినట్లును, తన్మూలమున భగవంతు నర్చించి నట్లగునని కదా మన మూహింపవలయును. సఖా! ఒక్క గోవు నారాధించిన

న్ని ఫలములు గలుగునపుడు మనమేల యప్పని నొనరింపక యున్నారము? సులభమైన కార్యముగదా యిది. దీని నాచ రింపకయున్నచో మనమింక నేపురుషార్థముల సాధింపఁగలము? ఇంతటి ప్రభావము గోవునందుండుటం బట్టియే కాఁబోలు గోక్షీరము లారోగ్యము నాయుస్సును బుద్ధిని వృద్ధిచేయునని వైద్యశాస్త్రము బోధించుచున్నది. మనకంటె మూఢులు లోక మున నుందురా? ప్రతిగృహస్థుఁ నొక్కగోవును గాపాడఁ జాలఁడా? సంసారభారమును సంతోషమున వహించును. దానఁ గలుగు లాభమేది? దుఃఖమే. దుఃఖనివృత్తికి సాధన మేది? గోపూజయే. ఏలయందువా? భగవంతు నారాధించిన సకల దుఃఖములు నివర్తించును. సకలధర్మముల నాచరించినట్ల గును. దాన సకలదేవతలను బూజించినట్లగును. అద్దానివలన లోకములకుఁ దృప్తిచేసిన యట్లగును. ఇన్ని లాభము లొక్క గోపూజచేఁ గలిగినపుడది కష్టకార్యము కానియపుడు మన మేల యప్పని నాచరింపకయున్నాము? ఎంత యవివేకులము! మిత్రుఁడా! మనమింకమీఁద నన్ని కార్యములకంటె నుత్తమ కార్యముగా భావించి యావును రక్షించుచు నుదయమున దానికి నమస్కరించుచు నుండవలయును. దానిని భగవంతు నిగా భావింపవలయును. మనలోఁ గొందఱు పాలీయదని యావును గాలఁదన్నువా రున్నవారు. అక్కటా! వారు మను ష్యులలోఁ బశువు లనఁదగుదురుగదా! గోవును గాలఁదన్నిన ధర్మమును దన్నినట్లు కాదా? దాన భగవంతునకు దుఃఖను కలిగించినవార మగుదుము కదా. మనమింక నెన్ని దానములు చేసినను ఫలమేమి? ప్రధానకృత్యమును మాని యప్రధాన కార్యములను చేయుచున్నవారము. అది శవశృంగారము

వంటిది కాదా? అయ్యో! ఎంత ప్రమాదం పడితిమి? ఇఁక మీఁదఁ బ్రధానధర్మము గోపూజనమని నిశ్చయించి యక్కార్యము నాచరించి పిదప నవకాశమున్న నితర సత్కార్యముల నాచరింతము. తల్లిదండ్రులఁ బూజించుట రెండవ కార్యముగా నిది తొలికార్యముగా భావింతము. ఇట్లు చేయుదుమని ప్రమాణము చేయుదుమా?" అన సూర్యనారాయణరాజును సమ్మతించెను. వారిరువురు నా ధేనువు కడకరిగి సాగిలఁబడి నమస్కరించిరి. "మాకు సద్బుద్ధి ననుగ్రహింపుమా" యని ప్రార్థించిరి. "సర్వదా నిన్నుఁబూజించు శ్రద్ధ భగవంతుఁ డనుగ్రహించునట్లు చేయుమా" యని వేఁడిరి. వారు తనదాపునఁ బడియుండ నాధేనువు చూచుచు మేయక నిలుచుండెను. కదలలేదు. వారు లేచి నమస్కరింపఁగా నంబారవమున నంగీకారమును దెలిపెను. వారందుల కానందించి దానికి మూఁడు సారులు ప్రదక్షిణ మాచరించి నమస్కరించి మధ్యాహ్నము కావచ్చునని యెఱింగి యాశ్రమమునకుం బోయిరి.

యోగియు వారచ్చటికి వచ్చిన యొకగడియకు లేచి వచ్చి వారింగూడిపోయి మాధ్యాహ్నికవిధుల నిర్వర్తించి ఫలాహారానంతరము కూరుచుండి యిట్లు ప్రసంగించెను. "శిష్యులారా! నేఁడు వనయాత్ర మీపురోవృద్ధికి హేతువయ్యెను. చక్కని ధర్మరహస్యము నేర్చుకొంటిరి. సర్వకార్యములలో గోపూజనము ప్రప్రధానమని మీరు గ్రహించుటయే చాలును. నాకోరిక ఫలించినది. ఇఁక మీకు నేఁడు పుణ్యస్థల దర్శనమునుగూర్చి ముచ్చటింతును. దాన నాయుపదేశకార్యము పూర్తినొందఁగలదు. గురూపదేశము ముఖ్యమే యనవచ్చును. కాని దానికంటె శ్రమించి తానే యనుభవ

మున గ్రహించినది ముఖ్యతమ మనవచ్చును. ఈ నాలుగు దినములు మీరీ వనయాత్రవలన నెన్నియో నీతులను గ్రహింపఁగల్గితిరి. నాయుపదేశ మవ్వానిని దృఢపఱచును. కావున మీరింక బుద్ధిమంతులలో నగ్రగణ్యుల రగుదురు. ఇఁక నాపని నొనరింతును. సావధానులరై నాయుపదేశ వాక్యముల నాలకింపుఁడు. వినినవానిని మదిఁ బదిలముగ నిలుపుకొనుఁడు.

## పుణ్యస్థల సందర్శనము.

ఆర్య బాలకులారా! భూభాగమంతయు సమాన మేవిష యమునను గాదు. ఫలభేదము కలదు. దేవాలయములు, నదులు, తీర్థములు, తపోవనములు, పర్వతములు, మహారణ్యములు భూభాగములయందెల్లఁ బావనములు. ఎట్లనఁగా నెంతమూర్ఖుఁ డైనను దేవాలయములోనికిఁ బోవునపుడు దుస్సంకల్పములు లేనివాఁ డగును. ఆస్థలమున భగవత్కళ యధికముగా వ్యాపించియుండును. విశేషించి యందుఁగల విగ్రహము దర్శింపఁగనే యించుకభక్తి యంకురించినట్లగపడును. అందుఁ గల భక్తులను జూచియైన భక్తి నభినయించును. దేవాల యమునుండి వెలుపలికిరాఁగా నది మాయమగును. కారణ మేమనఁగాఁ బూజించుకొనుటకై భక్తులందొక విగ్రహము నిలిపియుందురు. పూజాకార్యమున నందొక తేజస్సు వ్యాపిం చును. ఆతేజస్సు వ్యాపింపఁగా నెట్టి దుష్కృతముల నొన రించియున్నను మనస్సుమాత్ర మందున్న క్షణకాలము సుంత యైన నిర్మలముగా నుండును. నదులను దర్శించి యనాసక్తుఁ డయ్యును మునింగినయెడల ముహూర్తకాలమయిన మనస్సు

శుద్ధమగును. అట్లే తక్కినవన్నియు నని యెఱుంగవలయును. పుణ్యకార్యము లొనరించిన స్థలములయందుఁ బవిత్రతేజస్సు వ్యాపించియుండు. అందెట్టివారు ప్రవేశించినను నిర్మలులగుదురు. పుణ్యాత్ములైన మిక్కిలి పావనులగుదురు. దురాత్ములందున్నంతదనుకనైన నించుక మార్పునొందుదురు. కావుననే జ్ఞానులుకూడ యాత్ర చేయఁబోవుదురు. సాధుసంగతి నాక్షేత్రము పవిత్రమై దురాత్మకులను దుర్వృత్తినుండి మరలింప సమర్థమైయుండును. పెక్కండ్రు సాధువులు వచ్చుచు నందుఁ గొంతకాలము నివసించి యుండిన నందు భగవత్తేజస్సు వృద్ధియగును. అది పామరులను భక్తుల నొనరింపఁజాలి యుండును. ఈతలంపు గలిగియే పరమపవిత్రాంతఃకరణులు కూడఁ బుణ్యస్థలములయందుఁ గొంతకాలము నివసింపఁగోరుదురని యెఱుంగుఁడు.

మున్నొక వ్యాధుఁడు మంగళాద్రి యను పల్లియయందుండెను. అతని పేరు వీరసేనుఁడు. వాఁడు వృద్ధాచారమనుసరించి చిన్ననాఁటినుండియు మృగవధమున కలవాటుపడియెను. పదునాఱువత్సరములుకాఁగా నొంటరిగా నడవులకుం బోయి యెట్టి మృగమునైన వధించి తేఁజాలెను. శరసంధానము, లక్ష్యభేదనము నను కార్యముల నాతఁడద్వితీయుఁడు. ధైర్య మాతనికడఁ గాఁపురముసేయుచుండెను. పిఱికితనమనునది కలదా యని యాతని తలంపు. నిస్సహాయుఁడై యడవికింబోయిన నతనికొక యాపదయు రాదని వాని బంధుల విశ్వాసము. కొంతకాలమావృత్తినే సాగించుచుండెను. ప్రతిదినమాతనిచే హతములగుజంతువులను విశేషించిపక్షులను లెక్కింప నలవికాదు. వాని నాశ్రయించి పెక్కండ్రు బంధు

వులు బ్రదుకుచుండిరి. వానిని బొగడియుఁ దోడ్పాటుచూపు దుమని ప్రల్లదంబులాడియు నాతని వేఁటకై పంపుచుండిరి. సాయంకాలమాతని కెదురుపోవువారు కొందఱు గలరు. వారిచ్చకములాడువారని యతఁ డెఱుంగఁడు. తుదకా పల్లియంగల యాతనిబంధువులకెల్ల నితఁడే పోషకుఁడయ్యెను. వారి మిథ్యాస్తుతులను నమ్ముచుఁ దనకార్యము బహూపకారమని సంతసించుచు నింకను బాటుపడి చక్కఁగా నందఱఁ బోషింపవలయునని తలంచుచు నామూలమునఁ బుణ్యమార్జింపవలయుననియుఁ బ్రఖ్యాతి గణింపవలయుననియు నూహింపసాగెను. అంతియెకాని తనవృత్తి యెట్టిదని యిసుమంతయైన నాలోచించినపాపమున బోఁడయ్యెను. ఇరువదైదు వర్షములు నిండునప్పటికి గృహస్థాశ్రమమునఁ బ్రవేశించు తలంపు కల్గెను. వివాహితుఁడై యుండియుఁ గులవృత్తి యనుదానిని గులదైవమును సమానముగా భావింపవలయునను బంధువుల మాటలకుబ్బుచు నట్లే వ్యాపారమును సాగించుచుండెను. కులాయముల చెంతఁ గూరుచుండి శిశురక్షణపరాయణములగు పక్షులనే యతఁడు చంపుచుండెను. శిశువు లాకటంగృశించి నశించుచుండెను.

బాలకులారా! ఈనడుమ నించుక వేఱొక విషయమును దెల్పెదను. కులవృత్తియని కొందఱు హింసావ్రతపరాయణులగుట మీరు నెఱింగియుందు రనుకొనియెదను. దానియర్థము వారికిం దెలియదు. వ్యాధులకు వేఁట కులవృత్తియే యని శాస్త్రములందుఁ గలదు. దానియభిప్రాయము వేఱు. ఏమనఁగా రాజులు వేఁటలాడి దుష్టమృగములం జంపి జనులకు బాధకల్గకయుండఁ జూడవలయునని శాస్త్రములు విధించెను.

రాజులు వేట సప్తవ్యసనములలోని దైనను లోకమును రక్షింపఁగోరి యాచరించుచుండిరి. వారు మృగయులం గూడి పోవుచుండిరి. ఆమృగయులే వ్యాధులనఁబడువారు. ఎల్ల వేళల రాజులు వేటసలుపఁ గార్యాంతరముల మూలమున వలనుపడదు. కావున నాయాప్రాంతముల నీమృగయుల నియమించి యడవులకడ నుండు పల్లియలకుఁ గ్రూరమృగముల వలని బాధ కలుగకయుండఁ జేయవలయునని కట్టడచేసి వ్యాఘ్రాది క్రూరజంతువుల సంహరించి తెచ్చిన రాజోద్యోగులు బహుమానమింత యీయఁదగునని వృత్తి వారల కేర్పఱచిరి. క్రూరమృగముల వధించి దానికి ఫలముగా రాజబహుమానము నొందవలయుననుదానిని మఱచి జంతుహింస వృత్తి యనుకొనుచుందురు. హింసాకర్మము వృత్తియగునా? పులులకు హింసాకర్మము వృత్తియన్నఁ జెల్లునుగాని మానవులకు నది వృత్తి యగునా? ఒక్క మానవజాతి జీవితము సాగుటకై యెన్నియో సస్యములు, ఎన్నియో ఫలములు, ఎన్నియో కందములు, ఎన్నియో మూలములు నిర్మింపఁబడినవి. వానివలన సుఖజీవనము సాగును. అటులుండ హింసాకర్మము వృత్తి యనుట మిగుల నన్యాయము. క్రూరమతులు మాంసాశనమును గోరి కల్పించిన దుర్మతము. కాని వృత్తి కానేరదు. పరమకారుణికుఁడగు భగవంతుఁడు హింసావృత్తి నేర్పఱచునా? జ్ఞానధనులగుతపోధనులు హింసావృత్తి నిర్ణయింతురా? నిర్ణయించిరనుట విపరీతాభిప్రాయము. పక్షులం బొలియుట మఱెంత యన్యాయము. పక్షులవలనఁ గలుగు లాభములకుఁ గృతజ్ఞత మానవులు చూపఁజాలరనుట నిక్కము. అవి తమ పక్షవాయువులచే నెన్నియోరోగములం బోఁగొట్టును. మధుర

ధ్వనులచే మనోరోగములఁ బరిహరించును. తమ యొడలి రంగులచే నేత్రరోగములం దొలఁగించును. అన్నియున్ని యననేల ? వానివలనఁ గలుగు లాభములు వర్ణనాతీతములు. ఆవ్వానిం బొలియించుట పాపముమాత్రముకాక లోకమునకు లాభము పోఁగొట్టిన దొకటి యాపాపమునకుఁ దోడ్పడును. అట్టిదుష్కార్యము లొనరించు మానవులకు మరల మానవ జన్మము దొరకదు. ఇఁకఁ గథ వినుఁడు.

ఇట్టు లావీరసేనుఁడు మృగపక్షులం జంపుటయే తన బాణవిద్యాకౌశలమునకు ఫలమనుచుఁ జెలరేఁగు చుండెను. బంధువులకుఁ గల్పతరువనుట మాత్రము నిజము. మృగములను బక్షుల వధించి బంధువులఁ బోషించుట గోవధ మొనరించి పాదరక్షల దానము చేసినయట్లున్నది. కొంతకాల మీలాగున నాతఁడు లీలగా వేఁటలాడుచునుండఁగా నొక నాఁడు దూరారణ్యమునకుఁ బోవునూహకలిగెను. తనకన్నము ప్రతిదినము తెచ్చిపెట్టుట కేర్పాటుచేసి వలయుసాధనములం గొని కొందఱు మృగయులు వెంటరాఁగాఁ బ్రయాణము సాగించెను. భార్యలోనగువారు త్వరగా రావలయునని కోరిరి. తెల్లవాఱుజామున నే బయలువెడలి సాయంకాలమున కాగహనము చేరంగల్గిరి. అయ్యది సాంద్రారణ్యము. మృగ వితతి యమితముగాఁ గలదియే. దానింగాంచఁగనే యాతని చిత్తము పరమానందరసమున నిండిపోయెను. ఒక్కచో నివాస మేర్పఱచికొని కొందఱ నందందుఁ దిరిగి మృగములను దోలుకొని రానియమించి తాను గొందఱితో నొకజలా శయము చేరువ దుర్గమమగుచోటఁ గూరుచుండి యుండెను. గాఢాంధకారము వ్యాపించెను.

గర్భభారమున నడక మందము కాఁగా మెల్ల మెల్ల నడుగు లిడుచుఁ జప్పుడుగాక యుండ నేతెంచ నెంచినదానివలె నొక బెబ్బులి వచ్చెను. మృగములు నీరు త్రాగుతావు నియతమైయుండును. ఆరేవుననే యవి నీరు త్రాగుటకుఁ బ్రయత్నించివచ్చును గాని దప్పిగొన్నపుడెల్ల వలనుపడిన తావులం దిగి నీరు త్రాగవు. ఈవిషయము వేఁటకాండ్రకుఁ దెలియును. కావున నీళ్ళరేవున బొంచియుండి వానింజంపుదురు. మానవుల కట్టి నియమము లేవిషయమున నుండవు. కావుననే నియమబద్ధములు కాక యింద్రియములు విచ్చలవిడి పరుగు వాఱుచుండును. వాని నిలుపుకొనుట కెంతయో ప్రయత్నము చేయవలసి యుండును. అదియుఁ గొందఱే చేయఁబూనుదురు. అందుఁ గొందఱకే యద్దానిఫలము కలుగును. మృగములవలెఁ గొన్ని విషయములనైన నియమము మానవుల ప్రవృత్తులయం దున్న నెంత బాగుండును? పెక్కండ్రు జితేంద్రియులు కావచ్చును. అట్టి నియమము నలవాటు చేయఁ బ్రయత్నించుట మంచిది కదా!

ఆరీతిగా నా బెబ్బులి గర్భభారమున శ్రమంపడుచుఁ దానికిందోడు ప్రసవచిహ్నములును దోఁచుటం జేసి మఱెంత కష్టముల పాలగుచువచ్చెను. రేవునుండి జలములకడ కరుగుచుండెను. ఎండుటాకులు గాలికాత్రోవయందు నిండియుండుటం జేసి యెంత మెల్లగా నడుగులిడుచున్నను జప్పుడగుచుండెను. వ్యాధుఁ డద్దాని యెడమకణతకు సరిగా బాణమును సంధించి విడువనుంకించెను. ఆబాణము తగిలిన దాని ప్రాణము లందే పోవుననుట నిస్సంశయము. దైవవశమున నంతలో నందే నిదురించు సర్పము లేచెను. తన ముఖముకడఁ గూరుచున్న

మానవుని శరమెక్కుపెట్టి విడువ నుంకించువానిం గాంచెను. పెనురోషమున నెగిరి మీఁదఁ బడియెను. వాఁడులికిపడక తప్పదయ్యెను. బాణము చేయి వడఁకుటఁ గ్రిందఁబడియెను. కుడిచేతికే యాపాము చుట్టుకొనియెను. హస్త మాబాధను భరింపఁజాలనని మనస్సునకుం దెల్పుకొనియెను. ఇమ్ముచాలక యాపెనుఁబా మాతని నడుముకుం గూడఁ దన కాయమును జుట్టఁజేసెను. కదల మెదల లేక యాతఁడు మాట రాక నిబ్బరముచెడ దిక్కుతోఁపక పోవఁగా నిశ్చేష్టుఁ డయ్యెను. ఆ బెబ్బులి నీరు కడుపునిండఁ ద్రావి యెట్లో గట్టెక్కిపోయి యాచెంతనే యొక పెద్ద పొదలోఁ బ్రసవించెను. వీరసేనుఁ డింక బ్రదుకఁజాలనని యెట్లో యాబాధ నాపుకొని యొక యీల వేసెను. దూరమునందున్న వేటకాం డ్రాయీల నాలకించిరి. రెండుమూఁడుసారు లది వినఁబడఁగా ననుమానించి నాల్గవసారి మరల వినరాఁగాఁ దమ్ముఁ బిలుచున్నాఁడని యెఱింగి వేవేగ పరుగువాఱిరి. మరల నాయీల వినరాక పోఁగాఁ బాషాణఘాతమున నగ్గిఁ బుట్టించి మంట వేసిరి. నాల్గు ప్రక్కలు పరికింపఁగా నాపొదలో సర్పవేష్టితుఁడై యుండు వీరసేనుం గాంచిరి. ఎండిపోయినయాకులు గబగబ మండుచుండఁగా గాలివలన నామంట పొదలోనికిం బోవసాగెను. ఆవేఁడిగాలి సోఁకగా నాపెనుఁబాము వడివడి వానిని వదలి తనదారిం బోయెను. పోవుచున్న యాభుజంగముం జూచుచుండియు వారేమియుఁ జేయఁజాలకపోయిరి. వారు నిదేటిసర్పమో యని భయంపడిరి. వీరసేనుఁడు శవముంబోలి ధరపైఁ బడెను. తొలుత మృతునిగా నాతని భావించి యాతని బంధువులు చేతులు పిసికికొనసాగిరి. తుదకం దెవ్వఁడో సాహసించి

వాని నీవలకు నీడ్చుకొనివచ్చి నీళ్లు చల్లి మంట సాయమునఁ బరీక్షింపఁజాలెను. ప్రాణములున్నవని నిశ్చయించి యందఱకుం దెల్పెను. సర్పవిష మాతనికి సోఁకెనని వారు నిశ్చయించిరి. నాలుగుప్రక్కలు తిరిగి యేదోమూలిక తెచ్చి ముక్కురంధ్రములలోఁ బిండిరి. కొంతసేపటి కాతని కించుక స్మృతి గల్గెను. కాని లేవ శక్తిచాలక యుండెను. అందఱు తగిన యుపచారము లొనర్ప నాతఁడు బడలిక లుడుగ లేవఁగల్గెను. తెల్లవాఱెను. వీరసేనుని మృగయులెల్ల వహించి తెచ్చిరి. యెట్లో యిల్లు చేర్చిరి.

పాము బంధించుటం జేసి యాతనియస్థిపంజరము దిటవు తప్పెను. సడలినయట్లు లాతనికిం దోఁచెను. పరాధీనుఁడు కావలసివచ్చెను. కొలఁదినెలలు బంధువులు భార్యయు బహువిధౌషధములఁ బ్రయోగించి యెట్లో స్వస్థత గల్గించిరి. ఆయవస్థలోఁ గొన్ని నెలలు గడుపవలసినవాఁ డయ్యెను. ఆనాఁటి స్వప్రయత్నము దైవగతి నెట్లు విఫలమయ్యెనో, మీఁదు మిక్కిలి తనకెట్టియాపద గల్గెనో యతఁడు స్మరింపసాగెను. స్మరించినకొలఁదియు వీరసేనునకుఁ దన కృత్యమున రోఁతగల్గసాగెను. పురుషప్రయత్నమేల ఫలింపదన్న పౌరుషము దూరమయ్యెను. దైవయత్నమే బలవత్తమమన్నతలం పాతనికిఁ గల్గెను. క్రమక్రమముగా నయ్యది పెంపొందసాగెను. సంపూర్ణారోగ్యము గల్గునప్పటి కాతలంపు కూడ సంపూర్ణముగ మదిఁ బాదుకొనియెను. కావునఁ బూర్వపుఁ గార్యములు తుచ్ఛములని వానికిం దోఁచెను. పూర్వకర్మఫల మాసమయమునఁ బొడసూపెను. కావున నాతఁడు సంపూర్ణారోగ్యము కలుగఁగా దేశాంతరజిగమిషం బూనెను. బంధువుల కీవిష

యము తెల్పిన లాభము లేదని తీర్మానించుకొని యొక్కనాఁటి రేయి పయనము సాగించెను. మఱుదినము వారు వీరసేనుం గానక యడవికేగెనో యనుకొనుచు నెదురు చూచు చుండిరి. కొన్ని దినముల కతని స్థితి తెలియరానందున నేమయ్యెనో యని పరితపించుచుండిరి.

వీరసేనుఁడు గ్రామమునుండి గ్రామమునకుఁ బోవుచుఁ గొన్ని దినములకుఁ గాశీనగరము చేరఁగలిగెను. కాశీదర్శనమున నాతని చిత్తము పరిపక్వమయ్యెను. గంగాస్నానము, విశ్వేశ్వరసందర్శనము ననునవి యాతనికి మఱింతయుత్సాహమును గల్గించెను. పెద్దలం బొడఁగాంచిన నమస్కరించుచు వారిని సేవించుచుఁ గొంతకాల మందే నివసించెను. పూర్వకర్మము ఫలోన్ముఖము కాఁగాఁ దదనుగుణముగా బోధించుటకు మహాత్ములు సమకూడుదురు. తగిన పాత్రము దొరకునా యని యువ్విళ్లూరుచుందురు. సమయమున దర్శనమిత్తురు. తద్దర్శనమునఁ గృతార్థు లగుదురు. వీరసేనుఁ డొకనాఁడు గంగాతీరమున నుండఁగా వ్యాసమహర్షి దర్శన మిచ్చెను. వికారరూపమున నామునిపతి కనఁబడెను. కాని యారూపమును గాంచి యేవగింపక వీరసేనుఁ డుప్పొంగు భక్తిరసమున నమస్కరించి మహాత్మా! ఈపాపికి సన్మార్గమును జూపి పుణ్యము గట్టుకొనుఁడని ప్రార్థించెను.

పరాశరాత్మజుఁ డేమియుఁ బలుకక క్షణకాల మూరక యుండి వత్సా! చేసిన మహాపాపములు కొండలవలె నున్నవి. ఈజలముల నయనములు కడుగుకొని చూడుమనఁగా నాతఁడు వెనుకఁదిరిగిచూచెను. తాఁ జేసిన మహాపాపములు కొండలవలె నుండెను. వానిం జూడఁగానే యింతింతనరానిదుగఃఖ ముదయిం

చెను. బోరునవిలపించుచుఁ బాదములపైఁ బ్రాలి మహానుభావా! అనుభవింపఁబూనిన నెన్నికోట్ల జన్మములకు నీపర్వతము నశింపదు. ఎట్టిపాపములు నశించునో యీజన్మ మెట్లు ధన్య మగునో తెలుపుఁడు. అని ప్రశ్నింప నమ్ముని దరహాసిత వద నారవిందుఁడై వ్యాధా! నీకీపశ్చాత్తాపము కలుగుటయే పుణ్య కర్మఫలము. ఎట్టిపాపములైనను సత్కార్యములఁ జేయుట వలన నశించును. ఇంచుకయైన ననుభవింపక వదల నవకాశము లేదు. కావున నీకొక్క చక్కని మార్గ ముపదేశింతును. వినుము. సజ్జనుల సేవింపుము. వారు తీర్థములచెంత విశేషించి యుందురు. తద్దర్శనమున గొంత నశించును. మహానదీతీర్థముల స్నానమొనరించినఁ గొంత నశించును. అందందు భగవత్కళ యావేశించియుండు మహాస్థలముల దర్శించినఁ గొంతయడంగు. శిష్టభాగ మనుభవమున నడంగును. ఈమార్గముతప్ప వేఱొం డుమార్గము నీకుం దెలుపఁదగినది కానరాదు. ఈమార్గమునఁ బ్రవర్తించి యొక్కసంవత్సరమునకు మరలిరమ్ము. ఇందే నివ సింపుము. నీకీ పాపాద్రులవలని భయము తొలంగును. మరల రాఁగా దర్శనమిత్తునని పలుకుచు నంతర్హితుఁ డయ్యెను.

వీరసేనుని మనస్సు పరితపించెను. ఆ మార్గమునఁ బ్రవ ర్తింప నిశ్చయించుకొని పయనమయ్యెను. హరిద్వారము లోనగు దివ్యక్షేత్రముల సందర్శించెను. మహానుభావుల దర్శించి వారి యాశీర్వచనముల గ్రహించుచు హిమాలయ మునకుంజని గంగోత్తరము లోనగు మహానది జన్మస్థలములను గేదారాది మహాక్షేత్రములను బదరీనారాయణాది పావనా శ్రమములను సందర్శించెను. అందుఁగలమహామునులం గాంచి యథోచితముగ సేవించెను. ఒక్క పుణ్యస్థలము దర్శించినపు

డెల్లం గొంతపాపము నశించుచున్నయట్లాతనికిం దోంచుచుం డెను. మరలి యనేక దివ్యక్షేత్రములం గాంచి మహానదులం గ్రుంకులిడి పుణ్యాపురుషుల సేవించి నిర్ధూతకల్మషవ్రాతుండై వారాణసికిం జేరెను. కొలంది దినముల కొకనాంటి మధ్యాహ్నకాలమునం బరాశరాత్మజన్ముండు దర్శనమిచ్చి దివ్యచక్షువ్సు నిచ్చి చూడుమనెను. వీరసేనుం డట్టె పరికింపం బర్వతము లన్నియు నశించి కొంచెముగా మిగిలి యున్నట్లగపడెను. మహాత్మా! నాపాపము లెట్లు పోయినవో దానివిధ మెఱింగింపుమని వేండెను.

వీరసేనా! లోకమున నిన్నెవ్వరు దూషించుచు దాని కనుబంధముగ నీపాపముల లెక్కింతురో వారు నీకు బంధుమిత్రులని నమ్ముము. వారే నీపాపములలోం గొంతమాత్రము భాగమును బంచుకొనువారు. నీకార్యములంగాంచి యోర్వంజాలక నిన్ను బెక్కండ్రు దూషించిరి. వారెల్ల వానిని యోగ్యతానుసారము పంచుకొనిరి. ఇంకను గొంచెము మిగిలియున్నది. దాని నీవనుభవింప వలయును. నిన్నది వ్యాధిరూపమున బాధించును. దానిని బ్రీతితో ననుభవింపుము. త్వరగానశించును. లోకమునం బెక్కండ్రితరులదోషములం దడలి వారిని దూషించుచుందురు. అది గొప్పతప్పు. ఇతరుల గుణములను బొగడవలయు. దోషముల వెదకివెదకి దూషింపరాదు. వారి పాపములలోం గొన్ని వీరికిం జేరును. అట్టివారు నీకు మిక్కిలి బంధువులని నమ్ముము. ఇంక నీ వనుభవింపందగుపద్ధతి నాలకింపుము. ఒక్కసంవత్సరము నీ యవయవములనుండి క్రిమిసమూహము వెడలుచుండును. దాని కితరులంద తేవగింతురు. కాని నీవించుకంతయు వారిపైం

గినియకుండుము. సంవత్సరము వెళ్లగానే యాపాపము నశించును. మరల నీశరీరము యథాపూర్వముగఁ గాఁగలదు. నమ్ముము. ఆవల నీకుఁగనఁబడుదును. సదుపదేశ మొసంగుదును. అంతదనుక నోర్పుకొనియుండుము. అని యంతర్ధానమందెను.

వీరసేనుఁ డామహాముని వాక్కులను స్మరించుచు నుండెను. ప్రతిదిన మాతని యవయవసంధులనుండి నల్లని పురుగులు వెడలసాగెను. చూచినవారెల్ల నాతని దూషించుచుఁ బోవుచుండిరి. దగ్గఱకు రావలదని హెచ్చరింపసాగిరి. వారి కాతఁడు నమస్కరించుచు నుండెను. రాత్రి వేళఁ బరుండఁ జోటిచ్చువారు లేకుండిరి. విశ్వేశ్వరుని దేవాలయముకడ శయనించుచుఁ దెల్లవారుజామున లేచిపోవుచు నెట్లో సంవత్సరము గడపెను. సంవత్సరము వెళ్లు సమయమున నొక స్వప్నము వచ్చెను. మహాయోగి దర్శనమిచ్చి నీ పాపముల నెల్లరుఁ బంచుకొనిరి. నీవింక నిష్కళంకుఁడవు. భగవదనుగ్రహము నీయందుఁ బొడచూపెను. రేపుదయము నిన్నుం జూచినవారెల్ల నచ్చెరువందుదురు. యథాపూర్వముగ నీశరీరమలరారఁ గాంచుచు నిదియేమి మాయయో యని యూహింతురు. ముని దర్శనమిచ్చును. తదుపదేశమునఁ బరిశుద్ధాంతఃకరణుఁడవయ్యెదవు. ఇఁకఁ జాలకాల మిందుండకుము. నీభార్య నీకై పరితపించుచున్నది. ఆమె సాధ్వి. ఆ పతివ్రతను దుఃఖములపాలు సేయరాదు. వేటలాడకుము. అది మహాపాప కార్యము. పులుఁగులం జంపకుము. దాన నీకింత మహాపాప మొనఁగూడెను. అని యమ్మహాయోగి యంతర్హితుఁడయ్యెను.

వీరసేనుఁడు మేల్కాంచి శ్రీవిశ్వేశ్వరుఁడే దర్శన మిచ్చెనని నమ్మి యప్పుడే పోయి గంగలో మునింగెను.

నిర్ధూతకల్మషుఁడ నైతినని భావించెను. సూర్యోదయమున శంకరు దర్శనమునకుం బోయెను. దూరముగాఁ బొమ్ము. అని తన్ను బదలువారెల్ల నాతని జూడఁజాలిరి. ఏమి యీతనిశరీరము తేజోవంతమై యున్నది! పురువులు వెడలిరావు! ఇదే విశ్వేశ్వరుమహిమము కాఁబోలును. వీఁ డెంతభక్తుఁడో యని చక్కఁగాఁ జూచి చెంతకుంజేరి మాయపరాధముల క్షమింపు మని వేఁడుకొనసాగిరి. తమయపరాధమిందు లేశమైన లేదు. పరమేశ్వరుని కటాక్షమున నాపాపములు నశించినవి. అని వినయమునఁ బలుక వారెల్ల రాతని మహాభక్తుఁడని భావింప సాగిరి. కొలఁది గడియలకే వ్యాసమహాముని పాదసూపి యాతనిం బిలుచుకొని గంగాతీరమునకుం బోయి యుపదేశించెను. అది భక్తియోగమే యని నమ్ముఁడు. దాన నాతని మనస్సు పరమాహ్లాదము నందఁజాలెను. ధన్యుఁడనైతినని భావించెను. అమ్ముని వత్సా! నీవిఁక గ్రామమునకుం బోయి పత్నింగూడి సత్సంతానంబు గాంచి సుఖముగ బ్రదుకుము. ఈయుపదేశమును మఱువక యనుష్ఠింపుము. సకలశుభములు చేకూరును. భగవదనుగ్రహమున నుత్తమపదము లభించునని యాదరింప మ్రొక్కి యాతఁ డింటికింబోయి సాధ్వింగూడి భక్తుఁడై యుపదేశానుసారము ప్రవర్తించుచుండెను.

రాజకుమారులారా! పరులదోషముల నెమకుచు వానినే స్మరించుచు దూషించుచుండుట మంచియలవాటు గాదని మీ రెఱుంగవలయును. మీ రెప్పుడుగాని పాపాత్ములం గాంచినంతనే తొలఁగిపొండు. వారిని దూషింతు రేని యందుఁ గొంత మీకును భాగముగా లభించును. హింసాపరాయణత్వము మహాపాపము. దాని మనస్సునఁ జొనుపకుఁడు.

అహింసావ్రతము నవలంబింపుఁడు. మానవుఁడు వృద్ధియగుటకు మార్గము లనేకములున్నవి. కాని యందీనాలుగు ప్రధానములని నమ్ముఁడు. వనమునఁ గల భాగములం గాంచితిరి. మంచి నీతులం గ్రహింపఁగల్గితిరి. నాయెఱింగిన ధర్మములలో మీకుఁ దెలుపఁదగినవాని నెఱింగించితిని." అని సూర్యనారాయణవర్మను బరికించి "యేమిలాభము నీ కిందుఁ గలిగెనో చెప్పఁగలవా" యని ప్రశ్నించెను. "స్వామీ! పూర్వపుణ్యవశమున సీతారామరాజుతోడి మైత్రియు సహవాసము లభించెను. దాన నాకెంతో మేలుచేకూరెను. మహాత్ములరగు మీయుపదేశవాక్యముల యర్థమును గ్రహింపఁజాలితిని. పెక్కునీతుల నీమిత్రుఁడు వనదర్శన సమయమున నాకుం దెలిపెను. దాననే నాచిత్తము పవిత్రమాయెను. తమకరుణకుఁ బాత్రుఁడనైతిని. నా దుశ్చేష్టలం దలంచుకొనుచు సిగ్గుపడుచున్నాఁడను. సత్ప్రవర్తనమే మానవుని యభివృద్ధికిం గారణమని నాకిపుడు స్పష్టమయ్యెను. తక్కినవేవియు లేకున్న నిదియున్నం జాలునను సిద్ధాంతము నామది నాటెను. ఇఁక నిట్టిమిత్రునిం గూడియుండి జననీజనకులను సేవించుచుఁ బాఠశాలకుంబోయి గురువులకు నాపైఁ గృపకలుగునట్లు వర్తింతును. ఇప్పలుకులలో నొక్కదానినైన విడనాడువాఁడను గాను." అని యా భగీరథదాసు చరణములను బట్టుకొని విడువకయుండెను. కరుణాసాగరుఁడు కావున నానందబాష్ప బిందువుల నాతనిం దడుపుచు లేవనెత్తి వత్సా! నీవిఁక విఖ్యాతిపాత్రుఁడవగుదువు. పూర్వపుఁ జర్యల స్మరింపకుము. ఈమిత్రునింగూడి నెమ్మదినుండుము.

## సదుపదేశములు.

అని పలికి మరల నిట్లనియెను. బాలకులారా! అహింసా వ్రతమూనుఁడు. జననీజనకులయు గురువులయు నానతి మెయిఁ బ్రవర్తిల్లుఁడు. దీనాంధబధిరకుబ్జవికలాంగులం జూచి పరిహాసింపకుఁడు. దైవమునందుఁ బ్రభువునందు దేశమునందు భక్తి విశ్వాసము నభిమానము గలిగియుండుఁడు. పరోపకారము చేయు నవకాశము దైవవశమున దొరకెనేని యదియే జన్మ మధ్యమున శుభకాలమని సంభావింపుఁడు. పెద్దలతోఁ బరిహాసము లాడకుఁడు. అల్పులతో సహవాసము చేయకుఁడు. అధికులతో బంధుత్వము చేయకుఁడు. బీదల కాసపెట్టకుఁడు. ఇయ్యఁదలంచుకొన్నది కాలహరణము చేయక యిచ్చుచుండుఁడు. చేయఁదగు కార్యము నాలసింపక చేయుఁడు. అసద్వాదములఁ గాలము పుచ్చకుఁడు. సర్వదా పరోపకారము చేయుశక్తిని గటాక్షింపుమని భగవంతుని బ్రార్థింపుఁడు. బంధుగృహములకుఁ బలుసారులు వెళ్లకుఁడు. మిత్రగృహమునకు వెన్నిసారు లైనఁ బొండు. అసత్యములు పలుకుట కలవాటు పడకుఁడు. నిష్కపటముగా గురువులను బ్రశ్నించి సంశయములను దీర్చుకొనుఁడు. తీర్థయాత్రలకుఁ బోయినపు డందు విశేషము లేవని పరికింపుఁడు. నదులలో స్నానము చేయునపుడు దానిని గాశీగంగగాఁ దలంపుఁడు. ప్రతిదినము తక్కువ పక్షము గడియకాలమైన మౌనముగా నుండ నభ్యసింపుఁడు. దేహపరిశ్రమము చేయ నలవాటు పడుఁడు. ఓర్పుగలిగి యుండుఁడు. పరులసిరికి నసూయఁ బూనకుఁడు. విద్య చాలునని తృప్తినొందకుఁడు. కలిగినంత

సిరికిఁ దృప్తిపడుఁడు. మనసున నాశకుఁ జోటీయకుఁడు. దానికంటె విరోధి లేఁడని నమ్మియుండుఁడు. సత్ప్రవర్తకులతో సావాసము చేయుఁడు. దుష్టాత్ములతోఁ గలహింపకుఁడు. వారల పొత్తు పదిరూప్యము లిచ్చియైన వదలుకొనుఁడు. ద్యూతాదులచేఁ గాలము పుచ్చకుఁడు. ఉత్తమమార్గ మేదియని యెల్లప్పు డాలోచించుచుండిన నది తనకుఁ దానే కనంబడును. మీకంటెఁ జిన్నవయస్సు కల వారితోఁ జెలిమిచేయకుఁడు. ఉపకారుల నిత్య మొక్కసారి యైన స్మరింపుఁడు. దానగల్గుమేలింతయని వచింపనలవికాదు. మీరితరులకుఁ జేసిన యుపకారము నితరులకుఁ దెలుపకుఁడు. యాచకుఁడు కనఁబడిన నీయ నేమియులేకున్నను మంచిమాటలతో నైన నాదరింపుఁడు. అంతయకాని వారింగని యించుకయే సేవగింపకుఁడు. ఈచెప్పిన ధర్మములన్నియు మీరు సులభముగా నాచరణమునఁ బెట్టుకొనఁదగినవియే. వీనిని జక్కఁగా మనస్సున నిలుపుకొని ప్రవర్తింపుఁడు. అని సాదరముగాఁ దెలిపి ప్రతిదినముచేయుచు సత్కర్మములకై యోగి లేచెను. శిష్యులును గురువును గూడి వెడలి కర్మములను యథావిధి నిర్వర్తించి ఫలాహారములచేఁ దృప్తినొంది శయనించిరి.

---

# ఆఱవ ప్రకరణము.



భగీరథదాసు తమ్మాహ్వానించినట్లు విని రామచంద్ర మధుసూదనవర్మ లిరువురును సకళత్రులై యాశ్రమమునకుం బోయిరి. పగలు రెండవ యామము వ్యాపించియుండెను. సూర్యాతప మాయడవియందు సార్థకనామము కాదు. ఆశ్రమ సమీపమున మున్ను విడిసిన ఛాయాద్రుమముల క్రింద నే శకటములనిలిపి సరస్సునకుంబోయి పాదప్రక్షాళనాది కృత్యముల నిర్వర్తించివచ్చి యాశ్రమముం బ్రవేశించి యందుఁగుమారులం గానక యూరకకూరుచుండియుండిరి. మఱినాలుగు గడియలకుఁ గుమారులిరువురు ఫలములం దీసికొని సంతోషమున వచ్చిరి. వారింజూడఁగాఁ గ్రొత్తవారుగ నుండిరి. సత్యముగా వారు క్రొత్తవారే. వారిముఖముల నీతికళ తాండవమాడుచుండెను. సంతృప్తి వెలయుచుండెను. వారు జననీజనకులకు వందనము లాచరించి వారియనుమతిఁ బడసి చెంతఁ గూరుచుండిరి. కుశలము ప్రశ్నింపఁ జక్కఁగా బదులిచ్చిరి. సూర్యనారాయణ వర్మయు నెల్లర కుశలములడిగి మిత్రసహాయమునను గురువుగారి కరుణను ధన్యుఁడనైతినని పలికెను. వారిట్లు మాటలాడుచుండ భగీరథదాసువచ్చెను. ఎల్లరు లేచిరి. కుశలప్రశ్నము చేసి మాధ్యాహ్నిక విధులం దీర్చుకొనివచ్చి మాటలాడుదునని తానుమాత్రమే కుండికకుం బోయెను. కుమారులతో రాజు లిరువురు పత్నులంగూడి నివాసస్థలము చేరి భుజించి మరల

వచ్చి దాసుగారి యనుమతి నాశ్రమాంతరమునఁ గూరు చుండిరి.

దాసు మీకుమారులిరువురు సుఖముగానున్న వారుకదా యని ప్రశ్నించెను. రామచంద్రరాజు మధుసూదనరాజు సమ్మతముపైఁ బెద్దలచెంతనుండువారికిఁ గుశలములకుఁ గొఱంతయా యని బదులిచ్చెను. దాసు వారు వచ్చినదిమొద లంతదనుక జరగిన వృత్తాంతములనెల్లఁ దెలిపి వారి వనచర్యలం దాను జూచినట్లే యెఱింగించి వీరిరువురను దోడ్కొని పోవచ్చును. నాయెఱింగినంత, వారికిఁగావలసినయంత యెఱింగించితి. బుద్ధిమంతులై వీరు విఖ్యాతింగాంతురు. మీకు వశవర్తులై యుందురు. పుత్త్రవంతులై వంశమును వృద్ధి నొందింతురు. విద్యావంతులగుచు సత్ప్రవర్తనమే యలంకారము కాఁగా వర్ధిల్లుదురు. ఇంక నేఁజెప్పఁదగు విషయములు లేవు. మీరు రేపే యడవిని యాత్రవలెఁ దిరిగి పోవుదురుగాక. అని పలికి యూరకుండెను. ఆమాటల కానందించి వారా రేయిఁ గడపి మఱుదినము కుమారులం గూడి యాయాయితావులం దిరిగి చూచి మహానందభరితులై యందందుఁ గల విచిత్రములం గాంచి యీయీ నీతులను గ్రహించితిమని కుమారులు తెలుప నిది తగుననుచు ముని మహిమమును గొనియాడుచు మధ్యాహ్నమునకు మరలి వచ్చి భుజించి భగీరథదాసును దర్శించి యాశీర్వచనములఁ బొంది కుమారులం గూడి కనకపల్లికి వచ్చిరి. వారిరాక కాగ్రామవాసు లానందించి కుమారులచ్చట నన్నములేక యెట్లుండఁజాలిరో యని వింతపడి వారు తెలుపఁగా విని మూలికల ప్రభావమిట్లుండునా యని మెచ్చుకొనుచు దాసు పరోపకారబుద్ధి కానందించుచుఁ దన్మహాత్త్వ

మును గొనియాడుచు సూర్యనారాయణవర్మ నీతివేత్తయై పూర్వపు దుర్గుణములను దెలిసికొని వానిని మాని సీతారామ రాజునకు మిత్రుడగుట కింతింతనరాని యామోదమును గాంచుచు వారినెల్ల బహూకరించిరి.

కనకవల్లిలో రెండుదినము లుండినపిదపఁ బాఠశాలో పాధ్యాయులెల్లరు వచ్చిరి. వారలంగాంచిరి. సూర్యనారాయణ రాజు విశేషించి తనయపరాధమును సహింప వేఁడుకొనియెను. వారెల్ల నేకవాక్యముగా నాతని నాదరించి క్షమింపం దగినంత యపరాధ మిందు లేదనియు మీవంటి బాలకులకు నివి స్వాభా వములే యనియు వానిం దెలిపి బాగుచేయుటకే మేము కంక ణము కట్టుకొనియున్నవారమనియు నిఁక నావిషయములఁ దలంచుకొనవల దనియు యథాపూర్వముగా రావలయు ననియుఁ దెలిపి బుజ్జగించిరి. వచ్చినవారెల్ల వారికరుణకు బాలకుని పలుకులకు హర్షముప్పొంగ బాగుబాగని బదులు పలికిరి. మధుసూదనరాజు వారినెల్లఁ దాంబూలాదుల బహూ కరించి బాలుఁడుచేయు నపరాధముల మఱచి వాని నుద్ధరింప వలయునని ప్రార్థించెను. అపని మాకు విధికనుక మీరు తెలుప నక్కఱలేదని బదులుపలికి కుముదవల్లికిం బోయిరి.

మఱుదిన ముదయమున లేచి సూర్యనారాయణరాజు సీతారామరాజుకడకేగి చదువుకొని యింటికి వచ్చి భుజించి పాఠశాలకుఁ బోవ నుచితవేషమును దాల్చి నూత్నమిత్రునిం గూడి పోవుచుండఁగా నెల్లరు మహానందమునఁ జూడసాగిరి. సత్ప్రివర్తన మెట్టిమూర్ఖునైన బాగుచేయఁగల దనిరి.

ఉ. 'జానుగ భూతికిందొడవు సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానముదృప్తి విద్యకు శమంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్

దానము తాల్మి శక్తతకు ధర్మనిరూఢికదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణభూషణమెన్నఁగ శీలమేసుమీ.'

అన్న పద్యముం జదివి సీతారామరాజును బొగడిరి. భగీరథదాసు ననుగ్రహమున సూర్యనారాయణరాజు బుద్ధిమంతుఁడయ్యెనని పలుకసాగిరి. ఆమాటలు విని తనపూర్వపు దుస్థితిని స్మరించి చింతించుచు సత్సహవాసమును గల్గించిన దాసుగారిని భగవంతునిగా భావించుచు సత్ప్రవర్తనమెంత ధన్యమోయని వినుతించుచుఁ బోయెను. పాఠశాలం జేర రాఁగాఁ దోడి విద్యార్థులందఱు నెదుర్కొనిరి. యథాపూర్వముగాఁ గూరుచుండి పాఠములం జదువుకొనెను. మిత్రునిం గూడి సకాలమున నింటికి వచ్చెను. ఆసంవత్సరమున నాకక్ష్యలో నున్నవా రందఱికన్న మిన్నగాఁ గృతార్థుఁడయ్యెను. దానంజేసి ప్రథమపదకము నొంద నర్హుఁడయ్యెను. ఎల్లవారు నది యందువేళల నాతనింగరతాళముల బహూకరించుచు సత్ప్రవర్తన మహత్త్వమును గొనియాడిరి. ఎంతమూర్ఖుఁడైన సత్ప్రవర్తన మలవఱచుకొనిన బాగుపడుట కేశంకలు లేవని యుపన్యసించిరి. ఇందులకుం గారణము సీతారామరాజు సావాస మీ సూర్యనారాయణవర్మకుం గలుగుటయే యని వెల్లడించిరి. ఎల్లరు నిట్టుల్లాసంబున నొక్కమాఱుగా నుచ్చైర్నాదమున సత్ప్రవర్తన మెల్లర యభివృద్ధికారణమని ఘోషించినపు డందుఁగల బాలురందఱు తమరుకూడ నద్దాని నలవఱచుకొనవలయునని తీర్మానించుకొనిరి.

అది మొదలుకొని సీతారామ సూర్యనారాయణ వర్మలకుఁ బరస్పర స్నేహము పెంపొందెను. మఱికొందఱు వీరిం జూచి యట్టి సత్ప్రవృత్తినలవఱచుకొనవలయునని ప్రయ

త్సింపసాగిరి. తమకుచదువు కష్యులలో నొక్కఁడుయపరాధము తమవలన రాకయుండఁ గాపాడుకొనుచుండిరి. ఎల్లరు నొక్కనిం జూచి యింకనొక్కరుగా నీవిధమున వర్తింప నొక్కసంవత్సరమున కాపాఠశాల సత్ప్రవర్తనమునఁ బ్రఖ్యాతిం గాంచెను. పెక్కుతావులనుండి దుష్టబాలకుల నాపాఠశాలకుం గొందఱు పంపసాగిరి. స్థలము చాలనందున భవనము పెంచి కట్టవలసి వచ్చెను. సత్ప్రవర్తనమున కిది యుదాహరణమను పేరు నాలుగు దేశములలో వ్యాపించిన కొలఁది నా యుపాధ్యాయులయం దెల్లరకు మర్యాద వృద్ధికాసాగెను. దానిచే వారు మఱింత శ్రమపడి విద్యగరపుచు బాలురయందుఁ బుత్త్ర వాత్సల్యము గలిగియుండిరి. బాలురుపాధ్యాయులను బహూకరించుచు వారు చెప్పనచొప్పునఁ బ్రవర్తించుచు నేటేటఁ దమతమ పరీక్షలలో బహుమతుల నందుచుండిరి. ధనవంతులెల్ల బీదవిద్యార్థులకు ధనసహాయము చేయుచు విద్య వృద్ధి కావలయునని కోరుచుండిరి. ఆపాఠశాలయందుఁ జదువు బాలురు రాజభక్తి దేశభక్తి దైవభక్తి గురుభక్తి కలిగి దుర్వృత్తియనఁగా నెట్టిదో యెఱుంగక హాయిగాఁ జదువుకొనుచుండిరి.

కుముదవల్లిలో నున్న ధనవంతుఁడగు నొక క్షత్త్రియ ప్రవరుఁడు పాఠశాలకుఁ జెంత నొక యుపవనము నిర్మించి యందొక్క సౌధముం గట్టించి పాఠశాలాధికారుల కిచ్చివేసెను. ఆభవనమునందుఁ గాపురముండి బీదవిద్యార్థులందే భుజించుచుఁ జదువుకొనవలయుననియే యాసౌధ నిర్మాణోద్దేశము. దానికగు వ్యయమునకుఁ దగు ద్రవ్యము నిచ్చెను. దానివృద్ధితో శతసంఖ్య విద్యార్థులకు నన్నము

నివాసగృహము నను వానికిఁ గొంత లేకయుండెను. పెద్ద లొక్క సంఘముగాఁ జేరి బీదవారు వీరని నిర్ణయించి పంపుచుండవలయు నన్న పద్ధతి దృఢపడియెను. నూఱుగురు విద్యార్థు లాయారామము నడుమనుండు సౌధమున గదికి నలువురు చొప్పున నుండి హాయిగాఁ బఠించుచుండిరి. ప్రతి దినము రాత్రియం దొక్కొక్క యుపాధ్యాయుఁడుండి పాఠ మునఁ దెలియని విషయముల బోధించుచుండును. ఇట్టి మంచి పద్ధతు లాపాఠశాలయం దమరియుండుట యెల్లవారికి మహా సంతోషదాయకముగా నుండెను.

ఇఁక నా యిరువురు బాలుర విషయము దడవుదము. పాఠశాలయందుఁగల యుత్తమపరీక్షయం దిరువురు నుత్తీర్ణులై బహుమానములంది కనకవల్లిం జేరిరి. విద్యావంతులు, గుణ వంతులు నగు నాతనయులం జూచుకొని వారి తల్లిదండ్రులు గర్వపడుచుందురని యనుకొనువారుండిరి. వివాహయోగ్య వయస్సు రాఁగా వారికిఁ గుల శీల వయోవిద్యల నీడుజోడగు కన్యకలం బరిణయవిధిని గూర్చిరి. ఆ వివాహమహోత్స వము కొనియాడఁదగినట్లుండెను. ఎల్లజాతులకు వేలువేల నన్నదానము చేయఁబడియెను. నృత్తగీత వాద్యముల నెల్లరు పరమానంద మనుభవించిరి. కన్యాదాన సమయమునకు భగీ రథదాసు పిలువఁబడకయే వచ్చెను. ఎల్లరు నచ్చెరువందిరి. అక్షతలం గైకొని కన్నులుమూసి భగవంతుని ధ్యానించి యీ దంపతుల నాయురారోగ్యశీలములు గలవారినిగా నొనరించుచుఁ బరమేశ్వరుఁడు కరుణానీరధి కాపాడుఁగాత మని యాశీర్వదించి యెట్లో పోయెను. వచ్చునపు డెవ్వరును జూడనట్లే మండపము దాఁటిన తర్వాతఁ గూడ నెవ్వరును

జూడఁజాలకపోయిరి. తపశ్శక్తిచే నామహాత్మునకు వియద్గమనమున శక్తియున్నయట్లు భావించి వారిని దర్శించి మాటలాడఁజాలకపోయితిమికదా యని పరితపింపసాగిరి. ఈదంపతుల కేకొఱంతయుఁ గలుగదనియు నట్టి నిర్మలస్వాంతులు తమంతట తమరే వచ్చుటయే యిందులకు దృష్టాంతమనియు నెల్లరు నమ్మిరి ఐదుదినములు మహోత్సవముల నావివాహములు సాగెను. వచ్చినవారి యోగ్యతల ననుసరించి సత్కారములు చేయఁబడియె. ఎల్లరుల్లాసముల విఱ్ఱవీఁగుచుఁ బోయిరి. అన్ని జాతులకు విశేషించి దీనాంధబధిర కుబ్జాదులకు నెచ్చరికతో నన్నదానము చేయఁబడియెను. ఈదంపతులకుఁ బరమశ్రేయములు వర్ధిల్లుఁగాక! వీరికుటుంబ మీలోకమున నెల్లకాలము వృద్ధినొందుచు నుండుఁగాక. అని దీవించుచుం బోయిరి.

బంధువులెల్ల నుచితరీతి గౌరవింపఁబడి తమతమ నెలవుల కరిగిన పిదప నాదంపతులు దేవతాపూజలు గావించుచు నతిథుల నాదరించుచుఁ గడుమోదమున బీదవిద్యార్థులకు నన్నవస్త్రముల నిచ్చి తోడ్పడుచు జననీజనకులకు లోఁబడి వర్తించుచుఁ బెద్దలయందు భక్తిగలిగి వర్తించుచుండిరి. వారిం గాంచి కులమువారలే కాక గ్రామములోనివారెల్ల గర్వపడుచుండిరి. సీతారామ సూర్యనారాయణవర్మల విఖ్యాతి యెల్లకడల వ్యాపించెను. వారిం గాంచినపుడెల్ల వీరివృద్ధికిం గారణము సత్ప్రవర్తనమే కదా యనుకొనుచుఁ దమపిల్లలకుం గూడ నట్టిప్రవృత్తికలుగునట్లు నేర్పంజూచుచు నేయుపన్యాసమునందును సత్ప్రవర్తనమే వృద్ధిహేతువని యుపన్యాసకులు నొక్కి చెప్పుచుండిరి. సూర్యనారాయణరాజు కూడ

సమయ మరసి తనదుశ్శీలమును దెలుపుచు దానఁగల్గిన చెడుగులను బోధించుచు సీతారామరాజు సావాసమునఁ దానెట్లు బాగుపడెనో తెలుపుచు బాలురకు విద్యకంటె సత్ప్రవర్తనమే ప్రధానమని స్వానుభవమున నిరూపించుచుండెను. విన్నవారెల్ల నాతని గౌరవించుచు ననుభవపూర్వకముగాఁ బలుకుచున్నవాఁడు గాన నీయాశయము పరిగ్రహింపఁ దగినదని కొనియాడుచుండిరి. విశేషించి యాతనియందుఁ గనఁబడు కృతజ్ఞతాగుణమును ప్రశంసించుచుండిరి. ఇట్లెల్లవారి మన్ననలకుం బాత్రులై కనకవల్లియందు వారిప్పుడును సుఖముగా నున్నవారు. ప్రతివత్సరమందు నాపాఠశాలయందు సాగునుత్సవమునందు వారుగౌరవింపంబడుచుందురు. విద్యార్థులెందఱో వారింజూచి సత్ప్రవర్తనమున నిట్లుండవలయుఁ గదా యని నిశ్చయించుకొనుచుందురు. వారిమూలమున నెందఱో విద్యార్థులు బాగుపడిరి. బాగుపడుచున్నారు. బాగుపడఁగలరు.

క. మంగళము సత్ప్రవృత్తికి
మంగళము పరోపకారమానితభూషా
సంగత సుస్వాంతులకును
మంగళము కృపారసాభిమానుల కెల్లన్.



శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1935.